శ్రీ

# ఉషానాటకము

సటిప్పణము.

వేదము - వేంకటరాయశాస్త్రి

విరచితము.

ఐదవ ముద్రణము.

చంద్రికాముద్రాక్షరశాలయందు ముద్రితము.

వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,

4. మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీధి

జి. టి. మదరాసు.

1945



[వెల రు 1-4-0

# విజ్ఞాపనము.

ప్రౌఢజనైకవేద్యరసం బగు ప్రతాపరుద్రీయనాటకమువలెం గాక కోమలమతిసుగమం బగు దృశ్యప్రబంధం బొకటి అర్ధయామ మాత్ర ప్రయోజనీయముగను నిర్మించి యిమ్మని, నన్ను, విక్రమసింహాపురాంధ్రభాషాభిమానిసమాజమువారును మదరాసు విద్వన్మనోరంజనీసమాజమువారును కోరంగా, వారిప్రణయము నొప్పరికింపంజాలక, నాకుం బ్రతిభయును తీరికయు లేమికి అనుగుణంబుగా, ఈ చిన్నిరూపకమును రచియించినాఁడను గుణదోషనిర్ణయమునకు విపులహృదయు లగువిద్వాంసులు ప్రమాణము.

వేదము - వేంకటరాయశాస్త్రి.

వి. 1, మే, 1901.

P. I. C. Quota Holder No. M.S. 114 B. (30-10-'45 1000)

శ్రీ

ఈ నాటకమును

వీణాగానకళానారదులును

సాంగవేదములం దధీతులును సర్వదర్శనములందు నదీష్ణులును

సంస్కృత ప్రాకృ తాంధ్ర ద్రావిడ కర్ణాట మహారాష్ట్రాంగ్లేయ గ్రీక లాటి

నాద్యష్టాదశ భాషా లక్ష్యలక్షణాభిజ్ఞ సార్వభౌములును

ద్రావిడభాషా ఫైలాలజీ దర్శన ప్రథమ ప్రవర్తకులును,

మదరాస్ ప్రసిడెన్సీకాలేజీ ఫైలాలజీ ప్రాక్తన భాషా మహోపాధ్యాయులును,

బోధిసత్త్వకల్పులును

అగు

సన్మిత్త్రరత్నంబు

తాతపెల్లి మిరాదార్

# శ్రీయుత శేషగిరిశాస్త్రులు ఎమ్. ఏ. గారి

కీర్తిమూర్తికి

సమర్పించినాఁడను.

వే. వేం.

# నాటకపాత్రములు.

---

## పురుషులు.

సూత్రధారుఁడు.
నలకూబరుఁడు.
బాణుఁడు.
కుంభాండుఁడు.—బాణునిమంత్రి.
అహ్లాదనుఁడు.—బాణపుత్త్రుఁడు.
గంభీరవేది.—ఉషకై బాణుఁ డుద్దేశించిన వరుఁడు.
ప్రతీహారి.
హాహా హూహూలు.—గంధర్వులు.
అగ్ని, ఆదిత్యుఁడు, వాయువు, చంద్రుఁడు.
అనిరుద్ధుఁడు.—కథానాయకుఁడు.
విదూషకుఁడు.
కంచుకి.
పురుషుఁడు.—(కారాగృహసేవకుఁడు.)
గోపురమునాయకుఁడు. పతాకానాయకుఁడు.
శ్రీకృష్ణుఁడు.
శివజ్వరము, విష్ణుజ్వరము.
ఇంద్రుఁడు.

## స్త్రీలు.

నటి.
రాణి.—(బాణునిభార్య.)
ఉష.—బాణసుత, కథానాయిక.
చిత్రరేఖ.—కుంభాండసుత, ఉషాసఖి.
కరేణుక.—ఉషాధాత్రేయి.
మదనిక, కుముదిక.—ఉషచెలులు.
రంభ, ఊర్వశి, మేనక.
బంధురిక, కీరవాణి.—ద్వారకలో ఉద్యానపాలికలు.
రుక్మిణి.

శ్రీ

# ఉష.

---

ఉ. శ్రీరమణాత్మచోరుని వశీకృతబాణసుతాభిసారునిన్
మారునిసూనునిన్ బలిరమామహితాసురభూవిహారునిన్
గోరకధన్వికూటమునఁ గోపుర మెవ్వతె నిల్పి కాచె నా
శారిక పల్కుఁగాత సరసస్వనసంపద మీకు భద్రముల్. ౧

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు.—చాలును. అతివిస్తర మేల? ఆర్యా,

నటి—[ప్రవేశించి] ఏమిటి శెలవు ఆర్యపుత్రా?

సూత్ర.—ఆర్యమిత్రులు ఉషనే కనఁగోరుచున్నారు.

నటి.—అహాహా! మనకు నేఁడియును మంచికాలము వచ్చినది, ఆర్యపుత్రా.

సూత్ర.—నటీ యీయార్యమిత్రులకు శ్రీవేంకటరాయశాస్త్రులవారి ప్రబంధంబుపై నింతమక్కువకుం గతం బెఱుంగుదువా?

---

౧. పద్యము—శ్రీకలియుగ నారాయణునికి మనోహరుఁడును, తన్ను బాణపుత్రియయిన యుష వలచి తనకై ఇల్లు వదలి ఏకాంతభూములకు వచ్చునట్లుగా చేసికొని, బలిచక్రవర్తియొక్క సంపదచేత మహనీయములు అయిన పాతాళప్రదేశములందు విహరించినవాఁడును, అయిన ప్రద్యుమ్నపుత్రుని అనిరుద్ధుని ఆ పాతాళమార్గమును ప్రద్యుమ్నకూటమునకడ గర్వగుహాయందు ఏకాంకాదేవి గోపురము నిల్పినదియుం బోలె నిలసియుండి ఆబాణాదులవలన నుండి రక్షించినదో ఆశారికాదేవి (గోరవంక యని శ్లేష) మధురమయిన కంఠస్వరముతో నాట్యప్రయోగమునకు సామాజికులకును కవికిని శుభములను కలుగజేయుఁగాక.

ఆర్యమిత్రులు—విద్వాంసులయిన పెద్దలు.

నటి.—ఎఱుఁగ నేమి ఆర్యపుత్త్రా, వక్కాణించెద వినుము.

సీ. ఛాత్త్రసాహస్రప్రచారంబుగా నాట । కములఁ దన్నిగమంబుఁ గఱపినారు,
సర్వజ్ఞ సింగమసార్వభౌమునిగద్ద । యుక్కినదొరమును నెక్కినారు,
హాణరూపకరసం బుదరంబు నిండార । ద్రావి గెల్పునఁ ద్రేఁచి తనిసినారు,
టాటోటుంగవులు పటాపంచలై పాయఁ । గాంచిక వాటి కర్పించినారు,
*[బల్లారిభవ కవిపండితసంఘంబు । మదరాసులో రూపుమాపినారు,]

తే. కాళిదాసుకవుంకల నేలినారు,
మించిన ప్రతాపకృతిని నిర్మించినారు,
తగదె యో శాస్త్రిగారి గ్రంథమును గోర
మహిత వస్తు పరాయణ మానసులకు. ౧

సూత్ర.—బళి బళి! రసజ్ఞవుగదా. మఱి యిప్పు డీనాటకము నాడుదు మనకుం గలుగుకీర్తిచే మనపాత్రము లెల్ల నేమగుదురో!

నటి.—పంచదారబొమ్మ లగుదురు ; కాని, చీమలు పట్టవు లే. సరియె కాని, ఇక్కాలమున కవితాకామిని పండితులకడకు వచ్చుట లేదే. ఈమనీషి కడకుమాత్రము ఎట్లు వచ్చెనదో !

---

౧ ప.—ఛాత్త్ర=శిష్య. తన్నిగమంబుక్ = ఆనాటకముల లక్షణమును. కఱపినారు = నేర్పినారు. సర్వజ్ఞ సింగమనీఁడు వెంకటగిరి సంస్థానము నేలుచున్న శ్రీ శ్రీ రాజగోపాలకృష్ణ యాచేంద్ర మహారాజావారి పూర్వులలో మహా నీయుఁడు, సర్వవిద్యావిశారదుఁడు. హాణరుపకరసంబు = షేక్స్పియరు లోనగువారి యింగ్లీషు నాటకములందలి రసమును. కాంచికక్ - విమర్శన గ్రంథమాలికను. మహిత...లకుక్ = పూజిత మయిన యర్థమందు ఆసక్తి పైన మనస్సు గలవారికి.

*[ఈపంక్తి శాస్త్రులవారు తర్వాత చేర్చినారు.]

పంచదార—కీర్తి తెలుపుగాన దానివ్యాప్తిచేత నెల్ల నగుదురని భావము.

మనీషి=విద్వాంసుఁడు.

# శుద్ధవిష్కంభము.

స్థలకము:—అలక, చైత్రరథము.

నలకూబరుఁడు ప్రవేశించును.

నల.—[ఊర్ధ్వ మవలోకించుచు]

క. చల్లనివెలుఁగని యీజా
బిల్లిని డాసితిని; గండుపేరటిపావరే
యిల్లయి, రేలక మంటలు
నల్లైదునోఁకు డిది; దీనిచదురులు దెలిసె. ౪

హా! రంభ లేక నలకూబరుఁడు కల్ల గదా!

రంభ:—[ప్రవేశించి] కలిమిసామికట్టి లేక రంభమాత్రము కల్ల గాదా? అది సరిగాని, ఏవి మంటలు నల్లుచున్నవి?

నల.—ఈచంద్రకరములు, నీవు లేనితఱిని, నామీఁదికి.

రంభ.—ఇవి మహోపకారులు గదా! ఇవి గదా అమరావతినుండి నన్నిటకుం దోఁచినవి!

నల.—మఱి యీకడ వేల గలిగినది?

రంభ.—'ఎట్లు గండము తప్పించుకొని వచ్చితివి?' అని యడుగుదును.

నల.—వడివడి చూఱాయగా వివరింపుము.

---

చల్లనివెలుఁగని యీ చంద్రునిఁ గూర్చి వచ్చితిని. ఇది చంద్రుఁడు గాఁడు, మఱేమనఁగా, నుచ్చయసెదు పొదలో నివసించి మంటలు మండెడు కొఱవిదయ్యము, ఇదె దీని టక్కు. నాకు బోధపడినది.

తపోనలమునకు=తపోగ్నికి. హరనేత్రములలో = శివునికన్నులలో (శివునికి చంద్ర సూర్యాగ్నులు కన్నులు గదా.) పాకశాసనుఁడు=ఇంద్రుఁడు.

నల.—బళి బళి !

క. మంటలనోఁ గ్రైనన్నపు
డంటి యొరియఁ జేసి, యిప్పు డన్యోన్యపుపెట్లన్
గెంటి మనుచు నీకొంటెనుఁ
దుంటవిలుతుమామ కెఱఁగుదున్ భక్తిమెయిన్ ౭

రంభ.—

క. బాణునికొలువున కలగీ
ర్వాణులు సన, మనము పంచబాణుకొలువునన్
ప్రాణేశ రమ్ము పోదము ;
నాణెం బిది గాదొ యిట్లు నలుఁగుటకంటెన్ ? ౮

[అని నిష్క్రమింతురు.

శుద్ధ విష్కంభము ముగిసెను.

---

౭ ప — తుంటవిలుతుమామకున్ = మన్మథుని మేనమామ యయిన యాచంద్రునికి. ఎఱఁగుదున్ = నమస్కారము చేసెదను.

బాణు.—రా వోయి, నాయనా, రా కూర్చుండుము.

[అష్టావక్రుఁడు కూర్చుండును.

ఉష.—నాయనగారిపాదములకు ఉష ప్రణమిల్లుచున్నది.

[అని యట్లు చేయును.

బాణు.—రా, అమ్మా, రా. [అని దగ్గఱ కూర్చుండఁబెట్టుకొనును.

చిత్ర.—మామగారిపాదములకు చిత్రరేఖను మ్రొక్కుచున్నాను.

[అని మ్రొక్కును.

బాణు.—కల్యాణము, కల్యాణము, కూర్చుండుము, నీ చెలికడనే.

[చిత్రరేఖ ఉషకడఁ గూర్చుండును.

గంభీ.—మామగారిపాదములకు గంభీరవేదిని మ్రొక్కుచున్నాను.

[అని యట్లు చేయును.

బాణు.—కల్యాణము కల్యాణము, కూర్చుండుము.

[గంభీరవేది కూర్చుండును.

బాణు.—మంత్రిపుంగవా, మనవా రందఱు క్షేమమా!

కుంభా.—ఏలినవారిప్రతాపము కాచుచుండ క్షేమము గాక యేమి?

బాణు.—దేవతలు మిమ్ము చక్కఁగాఁ గొలుచుచున్నారా?

కుంభా.—కొలుచుచున్నారు; అనుకంపనీయులు.

బాణు.—ఓ. [అష్టావక్రుఁ గూర్చి] వత్సా, నీవు మాకపుకాల మెల్ల నేమి సేయుచుంటివి?

అష్టా.—గురువర్యులను శ్రీమచ్ఛుక్రాచార్యులను శుశ్రూషించుచుంటిని.

కుంభా.—దానవేంద్రా,

ప్రోదిఁగ బాలుఁడీతండు భార్గవుని శుశ్రూషించి, వేదంబులున్
వేదాంగంబులుఁ బంచలక్షణపురావృత్తంబులుఁ నేర్చి, యూ

బాణు.—[స్మితముతో] జడాత్ముఁడు, వాని కేమియు ముందుగాఁ దోఁపదు.

[చంద్రుఁడు ప్రవేశించి నిలువ నాఁ
నుంచి నమస్కరించి యగ్ని వీడుకొనును.

బాణు.—[వీక్షించి] సఖా. ఓరీ, ఆగస్త్యశాస్త్ర్యాదా, మంత్రపుష్పము చెప్పుఁడు. మీరేగదా సాక్షులరు.

ఇరువురు.—అట్లేను మహాప్రభూ.

అగ్ని.—ఓహో సభాస్తారులెల్లరు నాలించుఁడు:—

స్కంధగ్రంథులు నస్సి వాయువులు నిస్త్రింతధ్వనిన్ మ్రోగఁగా,
సింధువ్రాతము క్రాఁగ నీశ్వరజటాసింధ్వంగణంబుల్ తప్పఁగా,
బంధం జేసి సుమేరుమందరగిరి ప్రాగ్భారముల్ డొగ్గఁగా,
సంధాబంధురబాణదానవతపస్స్ఫారాగ్ని పర్వెన్ దివిన్. ౧౬

బాణు.—ఆహాహాహా!

అందరును.—ఆహాహాహా!

హాహుఁడు.—ఏమియాజ్ఞ మహాప్రభూ?

బాణు.—నిన్నెవరురా పిలిచినారు?

కుంభా.—త్రిలోకనాయకా, వీఁడు హాహాగంధర్వుఁడు, తపోవర్ణన శ్రవణపరవశుండై, తమరు ఆహాహా యని సాధువాదము పలుకఁగా తన్నుఁ జీరినట్లు భ్రమఁజెందినాఁడు.

---

౧౬ వ.—ప్రతిజ్ఞను దృఢముగా నిర్వహించువాఁడైన బాణాసురుని తపస్సుయొక్క మహాగ్ని ఆకాశమునందు వ్యాపించఁగా, ఒకదానిపై నొకటి గోడకీటులవలె పేటియున్న గాలికీటులు ఎడఁబాసి పిడుగుమ్రోఁతతో చీల సాగినవి, సముద్రముల సమూహము ఉడుకెక్కినది, శివుని జడలలోని యాకాశగంగయొక్క నీళ్లు తెర్లుచుండినవి, పాదుచెడి మేరుమందర పర్వతముల శిఖరములు ఊడి డొగ్గిపడినవి.

సాధు వాదము=మెప్పుం జెప్పుట.

బాణు.—[బిగ్గరగా నవ్వుచు] ఓరి నిర్భాగ్యుఁడా, హూహూహూహూ!
[అని బిగ్గరగా నవ్వును.

హూహూవు.—విశ్వనాయక, ఏమి యాజ్ఞ?

బాణు.—[నవ్వుచు] వీనిపేరు హూహూవా?

కుంభా.—అవును దేవా.

బాణు.—భ్రాంతులు నిర్భాగ్యులు! హేహేహే! [అని నవ్వి] హేహేగంధర్వుఁడు నొకఁ డిటఁ గలఁడా? హోహోహో! [అని నవ్వును.

ఆది.—ఓహో సభాసదులారా, వినుండు:—

వైకుంఠుం డలచక్రవాళ మనునావంబం దజాండామ భాం
డైక ప్రాంతము పేర్చి భవ్యపరిపాకార్థంబుగా నూఁకఁగా
నాకాశంబు ఘటించి ద్వాదశసహస్రాంశ్వగ్నులం బొన్ప నం
దీకల్యాణుతపంబు గ్రచ్చుఫల మయ్యెన్ సత్ప్రభంగంబుగా. ౧౭

బాణు.—వహవ్వా వహవ్వా! చూచితివా కుంభాండా! అయినను ఈ తుచ్ఛదేవతలు! చక్కఁగా వర్ణింపలేరు. మరల నేనే వర్ణించెదను విను. నా తపస్సునొకవింత, ఏమనఁగా.—

---

౧౭ ప.—నారాయణమూర్తి (యనెడు కుమ్మరి) చక్రవాళపర్వత మనెడి యావములో బ్రహ్మాండము లనెడు కుండలయొక్క సమూహమును పెట్టి చక్కఁగా కాలుటకు (శ్లేషకర మయిన పరిణామమును బొందునట్లుగా) ఆకాశ మనెడి యావమునకు ద్వాదశాదిత్యు లనెడి నిప్పును పెట్టఁగా, ఆ యావమునందు ఈ కల్యాణమూర్తియొక్క అనఁగా బాణాసురుని యొక్క తపస్సు గ్రచ్చుకాయగా ప్రవేశించినది.—ఆవములో గ్రచ్చుకాయ పడిన యెడల ఆవములోని కుండ లన్నియును పగిలిపోవును. అట్లే నారాయణ మూర్తి కాముచున్న బ్రహ్మాండముల కన్నిటికిని బాణాసురుని తపస్సువలన అపాయము కలిగినది.—విష్ణువుయొక్క కార్యమునకు భంగము కలిగినదనుట.

కుంభాండాదులు.—శబాస్! శబాస్!

కుంభా.—ఏలినవారివరములు వినం జెవులు దురదగొనుచున్నవి.

బాణు.—మహేశ్వరుఁ డిట్లు ప్రత్యక్షమై నా కిచ్చిన వరములు వినుఁడు.

క. చండికతో వాసం బై,
ఖండేందుశిఖుండు నాదుఁ గవనుం గాచున్;
జెండా పశుపతికి మద్భుజ
కండూతి దీఱ నిల్చి సుకదనం బొసఁగున్. ౨౦

అందఱును.—ఆహా! యీశ్వరానుగ్రహము! ఆహా! తపోమహిమ!

బాణు.—మఱియు నెట్లోయి సూర్యాగ్నులారా?

సూర్యాగ్నులు.—ఓ స్వామి ప్రభూ, మీ మహిమకు తపస్సునకు నిలువలేక పారకేత్రములందు డాఁగి చూచు చుంటిమి.

బాణు.—వహవ్వా! [రంభాదుల నుద్దేశించి] మఱి మీయాటపాటలు కానిండు.

రంభాదులు.—[ఆడుచు]

(గేయము)

నిన్నుఁ బొగడఁ దరమే!

బలిరాజసుత! నిన్నుఁ బొగడఁ దరమే!

---

కపర్దము = జటాజూటము. ఎగిసి = లేచి. ఆరక = నశింప. ఇల = నేల. సాంబుఁడు = శివుఁడు.

౨౦ ప.—ఖండేందుశిఖుండు = చంద్రకళాశేఖరుఁడు - శివుఁడు. గవనుక్ = పురద్వారమును. కండూతి = దురద. కదనంబు = యుద్ధమును.

గేయ—హరిహారి = నరసింహుఁడు (నరసింహస్వామి) యుక్తము. మనుమాత = ప్రహ్లాదుఁడు. అయ్య = తండ్రి - బలిచక్రవర్తి. గిరిశునిక్ = శివుని. పోరు = యుద్ధమును. కావలుఁడు = బలాఢ్యుఁడు.

అరహరికోపము నడఁచె నీముత్తాత,
హరిని భిక్షునిఁ జేసె నయ్య,
గిరిశుని గడపకాపరిని జేసితి వీవు,
పరము పో రడుగు కావలుఁడుమ కెవ్వఁడు ! నిన్ను॥
వేకన్నులున్న నేవెంట బెదరవచ్చు ;
వేకాళ్లు పలసకు పెరవు ;
వేకేళ్లు గల్గిన వేవే ట్లోసఁగవచ్చు ;
నీ కెవ్వఁ డీరేడు లోకములను నీడు ! నిన్ను॥
కలనఁ గాలాశ్వశృంగములు నీమీసము ;
చెలులకు ముదిరధనుర్లత ;
వెలఁదుల కాయించువిల్లు నీమీసము ;
ఇలలోన నీసాటి బలియుఁ డిం కెవ్వఁడు ! నిన్ను॥

బాణు.—మీకు గృహసమ్మార్జనాదిక్లేశముసకు బనులు ఇఁకమీఁద సంగీతవ్యాపారముననయుండ ననుజ్ఞ యిచ్చితిమి. చాలునా యీబహుమానము ?

రంభాదులు.—[పడపడ వణఁకుచు] మహాప్రసాదము.

బాణు.—[ఉషం దటియుం దిలిచి, చేయి పట్టుకొని,] అమ్మా, ఎంత

---

వేకన్నులు ఇంద్రునికిఁ గలవు. వేకాళ్లు సూర్యునికిఁ గలవు. పలసకున్ = పరారియగుటకు. కేళ్లు = చేతులు. ఏరేడు = పదునాలుగు.

కలనన్ = యుద్ధములో. కాల...ములు = యముని గుఱ్ఱము (అగుదున్నపోతు) యొక్క కొమ్ములు. కలన...లు = అమీసమును చూడఁగానే శత్రువులు గుండె బ్రద్దలై చత్తురనుట. ముదిరధనుర్లత = ఇంద్రధనుస్సు. చెలుల...లత—సువృష్టి సూచకమయిన యింద్రధనుస్సువలె సంతోషపెట్టు ననిభావము. వెలఁదులకున్ = స్త్రీలకు, ఇంచువిల్లు = (మన్మథుని) చెఱకువిల్లు—మరులు గొల్పు నని భా.

సమ్మార్జనాది = ఊడ్చుట లోనగు.

సుందరాంగునిం జేసినను రూపహీనుఁ డందువు. ఇప్పటికేని తెలివి కలిగెనదా?
ఇఁక నైనఁ బెండ్లి చేసికొందువా అప్పా.

[ఉష మెల్ల మెల్లన తండ్రి చేయి విడిపించుకొని నిష్క్ర
మించును, చిత్రరేఖ ఉష ననుగమించును. గంభీర
వేది ఉషను కంటికగపడునంతవఱకు వీక్షించి తర్వా
త టేసున్న రనును. అహ్లాదనుఁడు చిత్రరేఖ పోకం
గని తల వాంచి చింతిల్లును.

బాణు.— హా! ఏమి దీనిస్వాతంత్ర్యము! ఓయి గంభీరవేదీ, చింతి
ల్లకు. నేను బోధించి దీనిని ఒప్పించి నీకు వివాహము చేసి మాయక్కను
సంతోషపెట్టెదను లే.

గంభీ.— మామగారియనుగ్రహము.

[చిలుకలును కోయిలలును స్వాగతమంటపము చెంత
మెండుగా కూయును. తుమ్మెదలు ఝరము ఝంకా
రించును. మంటపమున మలయమారుతము వీచును.
పుష్పముల పరిమళము వ్యాపించును.

బాణు.— ఏమి యిది! ఋతువు వచ్చియున్నది, ఋతుధర్మము లెల్ల
నిట్లిప్పు డిచట యౌగపద్యంబునఁ బ్రకటమగుట వింతగా నున్నది?

కుంభాండాగ్నిసూర్యాదులు.— చేతనాచేతనములెల్ల ఏలినవారి యభ్యు
దయము నభినందించుచున్నవి.

కుంభా.— కుమార, మీనాయనగారు సంతసిల్ల నీవిద్యాప్రభావమును
వసంతవర్ణనం జూపుము.

అహ్లా.— నాదియును లోకవిఖ్యాతమా! అయినను పెద్దలమాట నతిక్రమింపఁజాల.

సరసిజ వేదిక దన్ని, శీతలజలస్నానంబుగా, నిర్మలాం
బరపాళిం దడియార్చి, మంచుఁ జెమరుల్, మాధుర్యానిలం బార్పఁగా,

---

ఋతువు = వసంతర్తువు. యౌగపద్యమునన్ = ఏకకాలమున. అభ్యు
దయమును = గొప్ప మేలును.

బుటసాపట్టుజరిబుటాపరిధానీయు స్త్రీయుతో సావం
బురభ్రాతోడ జవాహిపటలితో భూకాంత సొంపారెడిన్. ౨౧

బాణాదులు.—బళిబళి! వహ్వా!

అష్ట.—మఱియు వినుడు.

అతిశయకౌతుకంబు పొలయంగ, నశోకలతానవాంగి యీ
దక్షిణగంధవాహు బలితంపుఁగవుంగిటఁ గ్రుచ్చి, వే సమ
స్తక్షితిజాత లోలతలతావుల కప్పి, సుగంధవారి పు
ష్పాళులఁ జిప్పిలంగ గిసలయాధర మానుగ త్రిప్పెఁ జూడరే. ౨౨

బాణాదులు.—బళిబళి! శబాసు.

బాణు.—అట్లైన నగరి కేఁగి యుద్యానంబున వసంతశోభం దిలకింతము.

[బాణరాష్ట్రసుతకుంభాండులు నిష్క్రమింతురు.

[నేపథ్యమునందు]

ప్రేయసీ, ఈరాత్రియే మనకనయానికి స్వప్నమున గాంధర్వ వివాహమును నిర్వర్తింపుదము.

---

౨౧ క.—భూమి యనెడినాయిక వరుసగా వేడిమి వదలి (గ్రీష్మధర్మము), చన్నీళ్ల స్నానమాడి (వర్షర్తుధర్మము), తెల్లనివస్త్రములతో తడి యారబోసి (నిర్మలమయిన యాకాశమునందు జలము త్రిగ్గిపోఁగా—శరద్ధర్మము) సునుమందువంటి చిఱుచెమరును (హేమంతధర్మము) పుల్లలమీఁది గాలి తీర్పఁగా (శిశిరర్తుధర్మము), జరిగబుటాలు గల బుటాసాపట్టు పావడ ధరించి (నానావిధము లయిన పుష్పములతోడి చిగురాకు అంగిఁగాఁగ), దట్టము బంగారు జల్తారుగల మేల్ముసుఁగు దాల్చి (బంగారుధూళివంటి పుప్పొడి పైపై నంతటను వ్యాపించుచుండఁగా), మెండుగా నగలు (చిత్రవర్ణముల పూవులు పిందెలు పత్రులును) గలిగి, వసంతుఁడను నాయకునిం గలసెను.

౨౨ ప.—మితిలేని తమకము ఉప్పొంగఁగా, అశోకశాఖ యనెడి జవరాలు పరిమళములు వెదజల్లుచున్న యీదక్షిణపు వాయుదేవుని (చంద

ఆది.—[జనాంతికము, అగ్న్యాదులతో] మదనభాషితమును వింటిరి గదా. మనకు మంచికాలము వచ్చుచున్నది.

[దేవతలు నిష్క్రమింతురు. గంభీరవేది
మెల్లఁగా ప్రయాసతో వెడలును.

కరేణుక.—[వెనుకనుండి ప్రవేశించి గంభీరవేది చేయి పట్టుకొని విడిచి] నువు పోతూ వున్నప్పుడు ఎందుకు ఏడ్చినావు? చెప్పు.

గంభీ.—కరేణుకా, అదంతా, మాయకు ఏడిచినట్టునటం; నామాట నమ్ము. నాకు ఏమీ ఆకళ్ళే లేదు, ఏమీ ఆకళ్ళే లేదు. నీమీద తప్ప నామనసు ఇంకెక్కడా లేదు.

కరేణు.—అట్లైతే మరిరా యిప్పుడే పెళ్లి శోభనం అన్నీ కానీ.

గంభీ.—నీపుణ్యం, ఇక్కడ మాట్లాడకు, నాతో అవతలికి రా చెప్తాను.

[అని నిష్క్రమింతురు.

ప్రథమాంకము ముగిసినది.

---

నాది చర్పలు కాల్చి గమించుచు వచ్చిన దక్షిణనాయకుని) బిగువుగా ఆలింగనము చేసి, అంతట తటాలున ఎల్ల తావులందును మొలచిన తీఁగల పరిమళములు అతనిదేహమం దున్నందున (నానాప్రదేశములలోను సందుగొందుల లోను నుండు నాయికల పరిమళములు అతని దేహమందు ఉన్నందున) అతని పై అనుమానించి, మకరంద మనెడు బాష్పములు, పువ్వుల నెడి కన్నులనుండి కాలుచుండఁగా, అతనికి స్పష్టగానుట్లై తనచిగురా కేసియొడి పొడిని ఇయ్యక ఇటునటు త్రిప్పుకొనుచున్నది చూడుఁడు.—మలయమారుతము నానా జాతి పుష్పపరిమళములతో వచ్చి అశోకశాఖల వీచి అందలి పూవులనుండి మకరందమును క్రిందికి జార్చి దాని చిగురుటాకులను ఆడించుచున్నదని భా.

# ద్వితీయాంకము.

స్థలము:—శోణపురి, ఉషా ప్రమదవనము.

ఉష, సఖీయుగళము, చిత్రలేఖయును, ప్రవేశింతురు.

[ఉష తామరసెజ్జపై మూర్ఛితయై యుండును.
సఖు లిరువురు తామరాకులతో వీచుచుందురు.

చిత్ర.—[ఉషను కేలఁ దడవి నిర్వర్ణించి, ఆత్మగతము] ఇది కామజ్వర మని నేను మొన్ననే శంకించితిని.

ఆ. లలన డీలుపడియు లావణ్యమున మించె
నలుపు తక్క చందురకలయుఁబోలె ;
ఇట్లు జవ్వనులకు హితశత్రు వౌకాళ
మధునివేఁడి యగునె మరుఁడు గాని. ౨౩

నేను క్షణము ఉషతో నొంటిపాటున నుండి గుట్టు తెలిసికొనియెదను. [ప్రకాశము] చెలీ మదనికా, చెలీ కుముదికా, ఈపాటి సంతాపము సఖికి సున్నమైనది, తామరసెజ్జలకు శమించినది గాదు. అల్లయీయవ్వలి బాలచందనవనమునకుం బోయి చెలికై గంధపుఁబాలు కొని రండు.

చెలులు.—నీవు వచ్చునంతయుం జక్కఁబడు నని మేము మున్నే అనుకొంటిమి. [అని నిష్క్రమించిరి. ఉష తేరును.

చిత్ర.—ఉషా!

---

ప్రమదవనము = ఆటతోఁట. సెజ్జ=శయ్య.

౨౩ ప.—ఈజవరాలు కృశించియుం కృష్ణపక్ష చంద్రరేఖవలె కాంతి హెచ్చియున్నది. ఈవిధముగా యువతులను పస్తు హెచ్చించుచు నే ప్లేశ పెట్టెడు క్రూరుఁడు మన్మథుఁడుగాని వసంతపు టెండవేఁడిమి గాదు.

షండము=గుబురు.

ఉష.—[అనాకర్ణితకముగా] నాసఖు లెక్కడ? హా! మూర్ఛిల్లితిఁ గావలయు. ఆహా! మూర్ఛయే యుపకారిణి యైనది. చిత్రరేఖను దేర సఖులు చనియుండరు.

ఆ. చిత్ర మేమొ నేను జిత్రరేఖను జూడ
నిపుడు కోరినట్టు లెపుడుఁ గోర;
శాపదీన నైనతఱి డెంద మస్సులఁ
బెల్లు దలఁచు ననుట లెల్ల మఱపొ. ౨౮

చిత్ర.—ఓహో! చెలి నన్నుం గనలేదు. ఇది చఱియు ననుకూలము. నేను డాఁగి యీ మెవృత్తముం బరికించి రహస్య మెఱిఁగెద.

[అని యట్లు చేయును.

ఉష.—ప్రాణేశ్వరా, నిన్ను వెండియు నేఁ గాంతునో!

చిత్ర.—ఆహా! 'ప్రాణేశ్వరా' యనుచున్నది! నాతలంపే నిజమైనది. వృత్త మిట్లుండ శీతలోపచారముల నేమి ప్రయోజనము?

క. ముంపునిదాఘముచేఁ గల
గుండై పసిచెడినబండిగురివెందలతన్
వెండియు విలసిలఁజేయుఁగఁ,
బంచితుఁ డామనియ గాక పన్నిర్జగునే! ౨౯

మఱి యెవ రాధన్యుఁడు?

ఉష.—ఇఁక నేను గూఢరాత్రి దేహమును ధరింపఁజాలను.

చిత్ర.—ఆహా! ఎంతబలీయమైనది యనురాగము.

---

౨౮ ప.—తా.—తాపమునఁ దగులఁబడి యున్నప్పుడు హృదయము ఆప్తులను చూడ మిక్కిలి కోరు నన్నమాట స్పష్ట మగుచున్నది.

౨౯ ప.—నిదాఘముఁ జేసిన. ఆమనియు ఁవసంతుఁడే.

ఉష.—ఛీఛీ! ఏల కలిగినది యీపాడుబుద్ధి! నాకెందవమేనిక చిత్ర రేఖకు అపరాధ మొనర్చితిని.

చిత్ర.—ఏమి యపరాధము? ఎట్లు?

ఉష.—హా! చిత్రరేఖకుఁ జెప్పక నారహస్యమును దాఁచితిని.

చిత్ర.—అవును! ఏమి నామీఁదికూరిమి!

ఉష.—చిత్రం దలఁచిన ప్రత్యాశ కలుగును. చెలి యట్టి యుపాయశాలిని.

తే. చెలియ నావసగుట్టు తెలిసెనని సంచలికితిఁ,
దెలియదాయె నేమి తెన్ను నాకు!
తల్లి నేమఱించి వెల్లి తోఁడెదెసఁ గాంచి
తల్లిఁ బనవు లేడిపిల్ల నైతి. ౨౬

అట్లు కాదు, ఆశ నన్ను వెక్కిరించుచున్నది. స్వప్నవిహారవిషయమున చిత్ర యేసియు నేమి సేయఁగలదు.

చిత్ర.—ఏమి యద్భుతము! ఏమి యద్భుతము! స్వప్నమునఁ బ్రాణేశ్వరునితో విహరించినది నాప్రియసఖి. అధన్యునిగ్గ యీవిరాళి.

ఉష.—సఖి నాకద కేల రాదు నేఁడు! నాశరీరము దిగ్గనాని జేవు లేఁడి జీవితము ననంగవ్యాధుని కిచ్చి శాంతిం బొందెద.

చిత్ర.—ఈ వెకలుపలుకులాగే అటఁ డెవరో తెలియునో చూచెద.

ఉష.—చెలి వచ్చునంతలో నాశిశువులం గని యామంత్రించెద.

[అని ఆరామలతావృక్షముల నుద్దేశించి]

కురవక పుత్త్రకా, తిలక కుమారమిత్రమ్ముఁడ, పున్నాగ యన్నఁడా,
యరిదిగఁ బుష్ప మొందిన సొబగారెడు చంపకవల్లి పుత్త్రికా,

---

ప్రత్యాశ=ఆశ తీఱు ననునమ్మకము.
౨౬ ప.—అలికితిన్=భయపడితిని. బనవు=వద్దుపట్టి.
విరాళి=వియోగదుఃఖము. ఆమంత్రించెదన్=సెలవుగొనియెద.

చరసాసారవితప్తలోహమయదండవ్రాతసంప్రోతపం [అని
జరమయ్యెన్ బున్వుఁబోఁట; నాకిచట నేఁజూడన్ శుభం బయ్యెడున్!

చిత్ర.—సత్యము, చెలిమీఁద నిట దుర మే విరచిత మగుచున్నది!

వాయువ్యాస్త్రము దక్షిణానిలము, భాస్వత్పల్లవ ప్రీత సురా
గ్నేయాస్త్రంబుఁ, బ్రఫుల్ల కాంచనసుమానీకంబు బ్రహ్మాస్త్రముల్.
స్ఫాయత్కోకిలకాకలీధ్వని యిదే నారాయణాస్త్రం బహో!
కాయోత్పన్నుఁడు నాలుగస్త్రములతోఁ గాఁచెం చెలిన్ నెచ్చెలిన్!

ఉష.—నాతో లికా పునకే పోయెద. [అని పరిక్రమించి, కని,] ఏమి యిది, యీ నామధ్యలతానలందు ఈపుష్పరాసులు! ఈ తేనెసోనలు! ఇదేమి యింద్రజాలమా! ఓహో కాదు కాదు.

---

అశ ప.—ఇచ్చట, తీఁగల సమూహముల పైకొమ్మలు కొరడాదెబ్బలుగా నామీఁదికి ఊఁగుచున్నవి; తుమ్మెదల బారులు చేతులకును కాళ్లకును సంకెలలుగా చుట్టుకొనుచున్నవి. ఈ పూఁదోఁట చెట్లనుండి కాఱుచున్న మకరందధార లనెడు కాల్చిన యినుపశలాకలతో చేసిన పంజరముగా నున్నది. ఇట నున్నచో నాకు క్షేమ మెట్లు గలుగును?

దూరముఁ జయ్యద్ధము.

30 ప.—ఈ మలయమారుతమే వాయువ్యాస్త్రము, మెఱయుచున్న యీ చిగుళ్లగుంపే ఆగ్నేయాస్త్రము, వికసించిన సంపెంగపూవుల గుత్తమే బ్రహ్మాస్త్రము, వ్యాపించుచున్న కోకిల కాహళీ (సన్నాయి) ధ్వనియే నారాయణాస్త్రము; అయ్యో! ఇచ్చట మన్మథుఁడు ఈనాలుగస్త్రములతో చెలిని ఉషను బాధించుచున్నాఁడు. [బ్రహ్మ బంగారుబొజ్జవాఁడు బంగారుమయము బంగారు వన్నెగలవియుం గాంచన నామములకలదియుఁ గావున బ్రహ్మాస్త్రసామ్యము, నారాయణుఁడును కోకిలయుఁ నలుపు, కావున సామ్యము.]

(తరళము.)

కడిఁదివ్రాతయుఁ గాదు, తేనియ క్రందు పై ఖరిగా, దిదే
విడిచి యేఁగెద నన్ను మాత్రన విన్నవై యివి దిగ్గనన్
ఒడలు వే నయనంబులై నయనౌఘ మెల్లను బాష్పమై,[31
విడకు మమ్మని మాటిమాటికిఁ నను వేఁడుతీరిది చూడఁగాన్

[మదనబాధ నభినయించి] అహాహా! ఏమి యిది! న న్నేఁచుచున్నది! ఇది నిక్కముగా ప్రాణములఁకులే. అయ్యో! నాకూనలారా,

(తరళము)

పుడికి బుగ్గలు ముద్దుగొంటిని; బుచ్చి చుంచులు దువ్వితిన్;
గడకు మీరును పైరిపక్షమె కన్నులార యిటైతిరే!
పుడమి నింతటివంత యుండునె, పోలునే మనఁగా నిఁకన్!
గడిఁదిమారునిచిత్రరేఖకుఁ గాన్క నాయును రిచ్చెదన్! 32

హా ప్రియసఖా! [అని మూర్ఛిల్లును.

చిత్ర.—[వడివడిగాఁ దరిసి] హా! చిత్రరేఖా! నీవు ప్రాణ మిచ్చెదవు! అహా; ఎంత ప్రమాదము! ఎంత ప్రమాదము! నెచ్చెలీ, ఉషా, నేనే తప్పు చేసితిని. నేనే ఘాతిని. నిన్ను వంచించి నీయాయాసముం గంటిని. నీతోడిదే గదా లోకము నాకు. నేను లేక నీ వెట్లు? [అని యుష నొడి నిడుకొని] ఆశ్వసిల్లుము సఖీ, ఆశ్వసిల్లుము.

31 క.—కడిఁది=అధికమగుయున. క్రందు=కలుచు. దిగ్గనన్ = కటాలున. ఒడలు=దేహము. వే=వేయి. నయన ఓఘము=నేత్రముల సమూహము.

32 క.—బుచ్చి చుంచులు=చిన్నపిల్ల జొట్టులు. పైరిపక్షమె = మన్మథునిపక్షమే. కన్నులార=నన్నుఁ గన్న తల్లులార. వంత=దుఃఖము. మనఁగన్ = బ్రతుకుటకు.

(స్రగ్విణి.)

లేవె లేవే, సఖి! లేవె సక్కఁగానవే;
యీవు నే నొక్కఁడం చేఁదలంతుంగదే!
కావవయ్యా హరీ! కావవయ్యా హరీ!
జీవలోకం బిదే చీఁకటిన్ మున్గదే. 33

ఉష.—[ఆశ్వసిల్లి చిత్రరేఖకవుంగిట లేచి చూచుకొని] అహా! చిత్రరేఖా, ఇప్పుడు నీదర్శనముచే నాకుఁ గరము తాపోపశాంతి కలుగుచున్నది.

చిత్ర.—కర మేమి? నీమనోహరుని పేరు చెప్పుదువేని పూర్ణముగానే తాపోపశాంతి యగును.

ఉష.—[ఆత్మగతము] ఏమి యిది! ఈవృత్తాంతము ప్రియసఖి కెట్లు తెలిసినది? ఎఱుఁగ దని తలంచితిని! [ప్రకాశము] సఖీ, నీకు అది యెట్లు తెలిసినది?

చిత్ర.—ఇతరవిషయములు పెక్కులు తెలిసినట్లే.

ఉష.—[ఆత్మగతము] ఈమె మార్గములు తెలియరావు. అటయిన సఖికి ఆమహాపురుషుని పేరుమాత్ర మేల తెలియదు? నే నుచ్చరింప వినఁ గోరికగా నుండును. [ప్రకాశము] సఖీ, అంతటిపుణ్యము నాకు? నాకది తెలియదు సఖీ.

చిత్ర.—ఏది తెలియదు?

ఉష.—నామనశ్చోరుని నామధేయము.

చిత్ర.—ఆశ్చర్యముగా నున్నది? అటయిన అమహానుభావుని యసాధారణ రూపరేఖావిలాసముల వర్ణింపుము.

ఉష.—శక్యమే? [ఆత్మగతము] నే నెక్కడ, ఆయనను వర్ణించు

33 ప.—ఒక్కఁడు=ఒక్కటియు.

టెక్కడ? అయినను చెలియాజ్ఞ? ఏమి సేయుదు! ఎట్లు లీలజ్జాసింధువును దాటనేర్తు!

చిత్ర.—[నిర్వర్ణించి, ఉష మొగము దడవుచు,] ఇదేమి, సఖీ, నీమేనెల్ల పులకల మొలకలు నిండుచున్నవి?

ఉష.—[తనలో తాఁ జూచుకొని]

ఆ. పులకపటలి గాదు, మోహనాకారుని
మొలకనగవు సుధిని బొలసినంత,
సుడిగి సన్నసన్న శోకాంధకారంబు
నలసపోవుతీరు వనజనేత్ర. 38

చిత్ర.—నీవు చెప్పనక్కఱలేదు, ఈరోమాంచక్రమమునఁనే తెలియుచున్నదిలే. నీమనశ్చాంచల్యము నిన్నుఁ దెల్పెనకేళీక్రమము.

ఉష.—సఖీ, నీప్రతిభ కగోచరము కలదా!

చిత్ర.—ఏదీ, మఱి వర్ణింపు మాయువస్వరూపమును, నాప్రణయము నుల్లంఘింపవుగదా.

ఉష.—మన్నింపుము సఖీ, చిత్తవృత్తి కుదురకున్నది.

చిత్ర.—[ఉషను నిర్వర్ణించి]

ఆ. హా! యిదేమి సకియ రేగుండ దాఁకిన
తమ్మిపైరిబాతిబొమ్మ వైతి!

ఉష.—

ప్రాణనాథుసరసఁ బాసినవలనంత
నంగకములు గురియునశ్రువు లివి. 39

---

38 ప.—పులకపటలిఁగగుర్పాటుయొక్క సమూహము, రోమాంచక్రమముననేఁగగుర్పాటుచినవరుసపలననే.

39 ప.—రేయెం...పైన్నెల తగిలిన చంద్రకాంతశిలాప్రతిమ

చిత్ర.—నిన్నుఁ గన్న నీకై యతఁడును ఇట్టియవస్థనే పొందును. చంద్రునికై రోహిణి యెట్లో చంద్రుఁడును రోహిణికై యట్లే యుద్విగ్నులై యుండరుగదా.

ఉష.—సఖీ! నీపల్కులు ఆశాజనకములు, దీపనలు, దూరదృష్ట విషయములుగాఁ దోఁచుచున్నవి.

చిత్ర.—అట్లే అగుఁగాక. మఱి నీవల్లభుని స్వరూపముం జెప్పుము.

ఉష.—అనిర్వచనీయముం జెప్ప మనుచున్నావు.

చిత్ర.—వెండియు యత్నింపుము.

ఉష.—నీయాజ్ఞ.

ఆ. ఒకరిబోఁటియాతఁ డొకమాత్రమును గాఁడు,
ఎల్లసొబగులందు హెచ్చువాఁడు,
మంచిరీతి కెల్ల మందిరం బగువాఁడు,
పొచ్చె మేమి లేక పొలుచువాఁడు. ౩౬

చిత్ర.—బళిబళి! అయినను ఇట్టిపన్నిన ఎంత యసియును నొక్కినావు మునకు సరిగాదు గదా! వాస్తవముగా నట్టిపురుషుఁ డుండునేని నే నతని తెలియంగకయుందునా.

ఉష.—'వాస్తవముగా' అను మాటచే నాకు దిగులు గలుగుచున్నది.

చిత్ర.—భయపడకు, అతని ప్రతిమను వ్రాయుదము. సాధనములం దెచ్చెద. [అని, పోయి రంగులపెట్టియుం పటంబులును గొని వచ్చి యచ్చో లిఖ

---

కరఁగినట్లు నీవు చెమరు దాల్చితి వేమి?. వలవంతలో=విరహదుఃఖముచేత. అంగకములు=శరీరావయవములు. అశ్రువులు=కన్నీళ్లు.

అనిర్వచనీయము=చెప్పుటకు మాటలు లేనిది.

౩౬. ప.—సొబగులు=అందములు; మందిరంబు=ఇల్లు; పొచ్చెము=కొఱఁత.

ముగ నుంచి] మఱి కానిమ్ము, నారదులవారికృపచే నీ త్రిజగతియందు నీ నెఱుఁగనివారు లేరు.

ఉప.—[ధ్యానించి] ప్రియసఖీ, మహానుభావురాలా, ఇదె యత్నించెదను.

[అని ప్రాంత మభినయించి, కన్నీళ్లు వెల్లిగొనుటయు,
ప్రేళ్లు చెమర్చుటయు వణఁకుటయుం, సూచించును.

చిత్ర.—[నిర్వర్ణించి, నవ్వుచు,] చెలీ, ఏమి యిది! చివరకు ఆగంభీర వేదిగాఁడేనా నీమనోదయితుఁడు!

ఉష.—[ఉలికిపడి] వానిం జేర్కొనకుము సఖీ. హా! నాకన్న మంద భాగధేయులు ధరిత్రిఁ గలరే?

నాహృదయంబు తల్లడిల, నాయన నన్ను గభీరవేది కు
ద్వాహము సేయఁ బూనెఁగద,

చిత్ర.— దంతికిఁ దామరతీఁగఁ గట్టఁ బోలెఁ;

ఉష.—

సాహసవర్తనంబునకుఁ జాలను నాయనమ్రోలఁ; నెట్టులీ [32
మోహము దెల్పుదాన నెటు మోఁడి సహించెడిదానఁ! జెప్పుమా.

అయ్యో! నన్నేల సృజించెనో విధి! సఖీ, మృత్యువు దప్ప నాకు శరణము గలదా!

చిత్ర.—నాసాముద్రికజ్ఞానమున నీకు నమ్మకము గలదేని నీరూపము దుఃఖమునకై పుట్టినది గాదు.

ఆ. కాదు భంగపాటు, కల్యాణ మగుఁ గాని,
నిష్కళంక రూప నిధుల కెందు;

32 ప.—ఉద్వాహము = వివాహము; దంతికిన్ = ఏనుఁగునకు; మ్రోలన్ = ఎదుట; మోఁడి = మూర్ఖతను.

రాహుల వక్త్ర గోచరం బగునె శశిరేఖ?
సహను శివుని సుతాళిఁ బరఁగుఁ గాక. 3౮

ఉష.—నీ వేదేవతవు చెలీ?

చిత్ర.—మఱి గంభీరవేదినిగా నింతలో తగ్గ్రాసితి వేమి?

ఉష.—[కన్నీళ్లొలుకుచు] హా! ఏమి చేయుదును? మందభాగ్యధేయను?

చెలిరో, ప్రేళులు కంప మొందెను ప్రతిమం జిత్రింపలేనైతిఁ; బి
చ్చిలు లేఁజెమ్మట ఒల్కి వ్రచ్చు; కడుగుం జిత్తంబు నీ బాష్పముల్;
బలుదప్పిన్ నది దాసి రేఖ పెడసి జంబాలంబునం గూలితిన్;
లలనా, దైన్యము దాయ ప్రాపవతినై నేఁ గోం లగ్గు నాతిగ్గితిన్! 3౯

అయ్యో! నేను ప్రియుఁబాలను సఖీ! [అని యేడ్చును.

చిత్ర.—[కన్నీళ్లు తుడుచుచు] ఏమున్నది చెలీ. నాయకుండగనివాని జగతిని లేరంటినిగదా. ఇదె చూడుము, నే వ్రాసెద; నీ చెలువుని యిందుం గాంతువు.

[అని పటము లుంగొని వ్రాయును. ఉష ఆశ్చర్యపడి చూచుచుండును.

చిత్ర.—[పటము చూపి] సఖీ, దర్శనమాత్రమున నీనాయకుఁడో కాఁడో నీకుం దెలిసినను గుణోత్తరుల నించుక స్వరూపకథనముచే సంభావించెద.

---

3౮ ప.—చంద్రరేఖకు కళంకము లేదు, నిండు చందురునికి కలదు. రాహువు నిండు చందురుని మ్రింగునుగాని చంద్రరేఖను మ్రింగఁడు. అట్లే ఉష నిష్కళంకరూప కావున ఆమెకు భంగము కలుగదు, కల్యాణమే కలుగును. చంద్రరేఖను శివుఁడు శిరమునఁ దాల్చినట్లు ఉషను భర్త తలకెక్కించుకొనును (గారవించును) అని భా.—

3౯ ప.—పిచ్చిలు = జాఱుచున్న; ఒల్కి వ్రచ్చున్ = ప్రతిమయొక్క రంగులను చిక్కమొత్తముగా కరంగించి కలిపి వేయుచున్నది; రేఖ ఎడసి = రేఖను దూరమై; జంబాలంబునన్ = బురదలో; దాయ = వైరి; లగ్గు = మేలు.— చిత్రరేఖ నదివంటిది—కడమభావ మూహించుకొనవచ్చును.

ఉష.—నీవాగమృతమును వీనులారఁ గ్రోలెద.

చిత్ర.—సఖీ, ఈతఁడు భగదత్తుఁడు ప్రాగ్జ్యోతిషాధీశ్వరుఁడు.

అంతులు మీఱుదోస్సులఁ జటాలున వీనికటారిప్రేటులన్
గొంతులు త్రెస్సి నెత్తురులు గుబ్బలివాఁకలపోల్కి దూఁకుటల్
వింత దలిర్పఁ ద న్నపుడె పెంచిరి యరాజసులక్ష్మి యీతఁడున్
సంతస మొప్పఁ గ్రోవుల వసంతము గాండె సుజాడఁగాఁ జెలీ ౪౦

ఇతఁడా నీమనోదయితుఁడు ?

ఉష.—నామనోహరుఁడు కళ్యాణమూర్తిగదా.

చిత్ర.—ఈపాలు గనుము. [అని ప్రాంత నభినయించి, పటము చూపి,] సఖి, ఈతఁడు సహస్రకిరణునిపుత్త్రుఁడు; సహజకవచకుండలుఁడు; కౌరవులదళవాయి; ఇతఁడు దానవీరుఁ డెట్లో అట్లే యుద్ధవీరుఁడును; ఇతని యాహవములయందు :—

చుక్కలెల్లను డొంకచుక్కలై పెక్కులై । ఝుంఝుమాభినయ మాడుచదురనంగ,
కరములెల్లను గొంకకచ్చులై హెచ్చులై । మిడుతపోటు నటించుచుపదు వనంగ,
మిడుఁగురులెల్లఁ గ్రమ్మిం ముత్తై మించులై । యొకకం దెముగ దాఁటునోజయనఁగ,
వార్ధులెల్లఁ గార్వంబులై డంబులై । యుడుకు లేనిపయోధి యౌనయం టనఁగ,

తే. బుధులు వర్ణింతు రితని కార్ముకమునుండి,
యరిమొనలఁ గప్పు విశిఖ పరార్థములను ;
తరుణి నీ చిత్తచోరుఁ డితండ యౌని,
చెపుము, చెవి పట్టి తెచ్చి యిచ్చెంత నిడెద. ౪౧

---

౪౦ ప.—గుబ్బలి వాఁకల పోల్కిన్ = కొండ యేళ్ల వలె; తన్ను = ఈరాజును ; అపుడె = ఆయుద్ధసమయమందే ; క్రోవులన్ = గొట్టములతో (పిచికారులతో).

౪౧ ప.—చుక్కలు = నక్షత్రములు ; పెక్కులు = అనేకములు ;

ఉష.—ప్రియసఖీ, నాపయితుఁడు ఒకరిసేవకుఁడు గాఁడు.

చిత్ర.—అటయిన నీమాయి చూడుము. [అని ప్రాఁత నభినయించి, పటముచూపి,] సఖీ, యీతఁడు పాండవమధ్యముఁడు, పార్థుఁడు అర్జునాది ద్వాదశాభిఖ్యుఁడు.

క. ఏఁకరె నీతనికై యల
నాకాంగన యూర్వశియు మనఃప్రభవాగ్నిన్ ;
చేకొని చని యీతని నిజ
లోకమునన్ నాగసతి యులూపి వరించెన్. ౪౨

మఱియుం నీతఁడు,—

నీడమచ్చెముఁ గన్న నింగిమచ్చెము చేసి । కడిమిపందెపుమచ్చెకంటిఁ గొనియె,
ఒకతూరి వేల్పులయొకిమాని వీక్షించి । డంబు మీఱినకిరీటంబు గొనియె,
సురరాజుఁ ద్రోచి చిచ్చునకు ఖాండవమిచ్చి । తఱుఁగనికవదొనల్ ధనువు గొనియె,
ముక్కంటియౌదల నొక్కటి వడ్డించి । పాశుపతాస్త్రంబు పంచికొనియె,

---

ఝంఝాభినయము = వానతోడి తుపానుగాలియొక్క నాటకమును; చదురు =సఖి ; కరములు = కిరణములు ; మిడుకపోటు = మిడుకదండు పర్యాటను ; వడువు=విధము ; మిడుఁగుఱులు=నిప్పురవలు ; క్రొమ్మించులు = క్రొత్తమెఱుఁపుఁ దీఁగలు ; మించులు = అతిశయమైనవి ; ఒక...ఓజ = పందెము చేసి దాఁటు విధము ; వార్ధి = సముద్రముయొక్క ; ఔర్వంబులు = బడబానలములు ; డంబులు = అతిశయములు—పెక్కులు ; పయోధిన్ = సముద్రమును ; ఎనయుట=చేరుట ; కార్ముకమునుండి = ధనుస్సునుండి ; అరిమొనలన్=శత్రువుల సైన్యములను ; విశిఖ పరార్థములను=లెక్కకు మించిన బాణములను.

౪౨ ప.—ఏఁకరెన్=కృశించినది. నాకాంగన = దేవస్త్రీ - అప్సరస. మనఃప్రభవాగ్నిన్=మదనానలముచేత.

ఇట్టి త్రైలోక్యవీరుఁ డీయొక్కఁడు; చెలియరో, యాతఁడే నీదుచెల్వుఁడేని,
చిన్నిచిన్నారినుడుల వచింపవమ్మ, నీసములం బట్టి తెత్తు నీమోసలకును. ౪౩

ఉప.—ఇంతకన్న సుకుమారుఁడు నా ప్రాణవల్లభుఁడు.

చిత్ర.—[ప్రాత నభినయించి, పటము చూపి,]

మత్త. చూడుఁ డీరల వాఁడిసింగపుసూటిపాణుల జాణలన్
బాడికోడెయఁగట్టికొమ్ములఁ బోల్పుతొమ్ముల నిర్వురన్
నాడెపు జ్జవ రాలి గుబ్బల నర్మపుం గరి కోఅలన్;
జేడె నీదార నిందుఁజూపుము, చెచ్చెరం గొని వచ్చెదన్. ౪౪

ఉప.—ఇంతకన్న సులక్షణుఁడు నావల్లభుఁడు.

చిత్ర.—[ప్రాత నభినయించి, పటము చూపి,]

(తరళము.)

ముదితరో, కనుఁగొమ్ము వీరల మోహనోజ్జ్వల మూర్తులన్
గొదలు దీఅ జయంతునిన్ నలకూబరున్ సుమమాభరున్

---

౪౩ ప.—మచ్చెకంటిరో = ద్రౌపది నుడుట; వేల్పులరేనిమానిని = దేవేంద్రుని; చిచ్చునకున్ = అగ్నిదేవునికి; తియ్యగనికవదోనలు = అశ్వయకుమారద్వయమును; ఒక్కటి = ఒకగుద్దు - లేక - దెబ్బ.

౪౪ ప.—ఉపా, అర్జునుని తమ్ములయిన నకుల సహదేవులను ఈ యిరువురను చూడుము, పరాక్రమ మనెడి సింహముయొక్క సూటితప్పని పంజాలుగాను ధర్మ మనెడి వృషభముయొక్క గుబ్బకొమ్ములుగాను, అంద మనెడి గుబ్బెతయొక్క గుబ్బలుగాను, కేళియనెడి యేనుఁగుయొక్క కోఅలం గాను ఉన్నారు. (తుల్యులు పరాక్రమవంతులు ధర్మవంతులు సుందరులు, కేళిచతురులు అని భా.) నీనాయకుఁడు వీరిలో నొకఁడేని చెప్పుము; తక్షణమే పోయి తెచ్చెదను.

త్రిదశనాయకుముద్దుఁబట్టి నుదీచినాయకుపట్టినిన్ ;
మదిరలోచన, నీ ప్రియుం జెప్పుమా యటం గనుపట్టినన్. ౭౫

ఉష.—సఖీ, ఇట్టి సామాన్యులను వ్రాసెన వేల ?

చిత్ర.—అటులన, ఈమాలు గనుము. [అని ప్రాఁత నఖినయించి, పటముచూపి,]

వర్ణింపన్ ననుబోంట్ల కౌనె సఖి యీ ద్వారావతీవల్లభున్
అర్ణోరాశి సుతా మనోహరుని విశ్వాత్మున్ స్థితిఖ్యాతిప్రతున్
శీర్ణావిద్య హృదంబుజోదర మహాసింహాస నాధ్యాసునిన్
బూర్ణుం గేవలుఁ గేళిమానుషతనున్ భోగింద్ర తల్పున్ హరిన్.

ఉష.—నీమహిమ నాకు వెల్లఁ గకుచున్నది !

క. నాలుకలో శారదయున్,
దూలికలో నజుఁడుఁ, గ్రాలుదురు నీకుఁ జెలీ !

౭౫ వ.—మదిరలో = ఓ చెడియా ; కోడలు తీఱన్—కోఱికలు తీఱు నట్లుగా-తనివి తీరునట్లుగా ; జయంతుఁడు త్రిదశనాయకుని (దేవేంద్రుని) ముద్దుఁగుమారుఁడు, నలకూబరుఁడు ఉదీచినాయకు (కుబేరుని) కుమారుఁడు ; సుషమాభరున్ = ఉత్కృష్టమయిన శోభను ధరించువానిని - అత్యంత ప్రకాశ మానుని [ఇది జయంత నలకూబరులకు విశేషణము]; మదిరలోచన = చూచు వారికి మద మెక్కించు నేత్రములు గలదానా.

౭౬ వ.—సఖీ, ద్వారకానాథుఁడును (క్షీర) సాగరకన్య యగుమహా లక్ష్మియొక్క చిత్తమును హరించినవాఁడును, ప్రపంచ స్వరూపుఁడును, ప్రపంచ రక్షణమందు పనిచేయువాఁడును, ఎవరికి అవిద్య (అహమ్మతి) నశించినదో వారి హృదయకమల మనెడిసింహాసనమందు కూర్చుండువాఁడును,నిండినవాఁడును, అద్వితీయుఁడును, లీలార్థమై మానుషదేహమును దాల్చినవాఁడును, నాగేంద్రశయానుఁడును అయిన యా శ్రీకృష్ణుని వర్ణించుటకు నాబోంట్లకు శక్యమా

కేలఁ లిఖయించుటగాఁ,

గ్గిలాటము సల్పి నన్నుఁ గలఁగింతుఁగదే! ౪౭

చెలీ, నన్ను వెక్కిరించుటకా నన్ను ముందు వ్రాయుచుంటివి?

చిత్ర.—ఈ వేమాయలవాఁడేనా నీమనోదస్యుఁడు?

ఉమ.—ఈయన కాఁడు. (వణఁకుచుం గేలు మోడ్చి) ఈయనం గనఁగా నాయెదను భయ భక్తి సంభ్రమంబులు వొడముచున్నవి! నా ప్రాణ దయితుఁ డీపోలికనుండును.

చిత్ర.—ఆహా! ఏమి నీయోగము! ఏమి నీకలిదంద్రులభాగ్యము! [అని మరల వ్రాసి, చూపి,] ఈమాయి కనుము.

సీ. నీకన్ను లిజోదు వెలివిగ్గఁ డెక్కెముల్, నీయాస్య మీదోర శస్త్రకాఁడు,
నీయూర్పు లితేని నిఖిల చైత్ర రథంబు, నీపల్కు లీరాతు నీటుఁ దేజ,
నీదుమే నీకూరు నిర్నిద్ర చాపంబు, నీరోమరాజి యీవీరుమౌర్వి,
నీనడు మీదేవు నిరుపమాకారంబు, నీదులావణ్య మీతేజ తాత,
నీపదచ్ఛాయ యీతనిప్రాపురియు, సిరికి సిరి, చిట్టకములకుఁ బట్టకంబు,
అందముల కంద, మితఁడ నీయనుఁడేని, భాగ్యవతులందు నకే నీవె భాగ్యవతివి.

---

౪౭ క.—శారద=వాగ్దేవి; తూలిక = ప్రతిమను వ్రాయుకుంచె; అజుఁడు = బ్రహ్మదేవుఁడు; [సాక్షాత్సరస్వతివలె అద్భుతకవనముతో వర్ణించుచున్నావు, బ్రహ్మవలె (పటమునందు) మూర్తులను సృజించుచున్నావు అనుట.] కేలన్=చేతితో; గ్గిలాటము=మాయ; కలఁగింతు=కలఁత పెట్టుచున్నావు.

దస్యుఁడు=దొంగ.

౪౮ ప.—ఇది మన్మథావతార మయిన ప్రద్యుమ్నుని వర్ణన. వరుసగా—నీకన్నులు ముచ్చెమలు, నీ ముఖ్యకనుచు చంద్రుఁడు, నీశ్వాసము మలయమారుతము. నీ వాక్కు చిలుక, సీకరీకము పుష్పము. నీమాఁగారు తుమ్మెదల బారు, నీతు నడుము లేదు, నీ దేహకాంతి పాలసముద్రము, నీ యడుగులు చిగుళ్లు. అని భావము; ఈ చెప్పిన యుపమానములు మన్మథునికి వరుసగా

ఉష.—[తెల్లవోడ్చి వణఁకుచు] అహా! ఏమి నీమహిమ! నావల్లభుఁడు కేవల మిట్లే యుండును. కాని, ఈయన ప్రాంతమున నే నిలువఁజాల. ఈయనకు నేను కొలువుకత్తెను గాని దయితం గాను. నాసామి యింతకన్నం గోమలాంగుఁడు.

చిత్ర.—మఱి యీమాట గనుము. [అని వ్రాయును.

ఉష.—అహా! ఈమాట నీవు వ్రాయుచున్నావు!

[అని హాస్యాశ్చర్యములు పెనంగొన నిర్వర్ణించును.

చిత్ర.—

మత్త. భూరిపుణ్యము జన్మకోటులఁ బ్రోవు సేయనివారికిన్
దీరు సూడఁగ నేని యందని ధీర కాంత శరీరునిన్
శూరునిన్ గుణి వీరునిన్ బుధ సూరి గేయ విహారునిన్
మారు ముద్దుఁ గుమారునిన్ సుకుమారునిన్ గనుమా చెలీ.

[ఉష చిత్రరేఖం గవుంగిలించును.

---

ధ్వజము మిత్త్రుఁడు విజయరథము వాహనము విల్లు శార అంగము (మదనునికి దేహము లేదుగదా) మాతామహుఁడు నై యుండుట ప్రసిద్ధము; కావున ఈతఁడు ప్రద్యుమ్నుఁ డని భావము; నిఖిలజైత్ర = ఎల్ల వారిని జయించునట్టి; నిర్నిద్ర = అమందమైన; చాపంబు = విల్లు; నిరుపమ = సాటిలేని; శర = దోర; ప్రాపుసురియ = ముఖ్యసాధనమయిన సురకత్తి; చిట్టకము = శృంగారచేష్ట; అనుకుఁడు = ప్రియుఁడు.

భా. ప.—విస్తారమయిన పుణ్యమును అనేకకోటిజన్మములయందు ప్రోగు చేసికొనివారికి ఇతనితీరును చూచుట కైనను ఘటింపదు. అట్టి యీతఁడు గంభీరమనోహరమూర్తి పరాక్రమవంతుఁడు గుణవంతుఁడు ఉత్సాహవంతుఁడు విద్వాంసుఁడు జ్ఞానులు మెచ్చి పాడఁదగినవర్తన కలవాఁడు ప్రద్యుమ్నుని ముద్దుఁగుమారుఁడు కోమలాంగుఁడు. ఇతనిం జూడుమీ ఓ చెలీ.

చిత్ర.—ఈమహాభాగుఁడేనా నీసామి?

ఉష.—[లజ్జతో] అవును.

చిత్ర.—బళిబళి! కృష్ణపౌత్త్రుని ప్రద్యుమ్నపుత్త్రుని అనిరుద్ధకుమారుని వరించిన నీకన్న నెవ్వతె ధన్యురాలు! హరివక్షమునం దక్క మహాలక్ష్మి మఱి యెచటం జేరును!

ఉష.—ప్రాణసఖి, నీమహిమ యనిర్వచనీయము! ఇది మొదలు నేను నీదాసిని.

చిత్ర.—కావు, నాప్రాణమవు.

[అని కడమపటముల సుఱుమాడి దాఁచును.

ఉష.—[అనిరుద్ధప్రతిమ నుద్దేశించి] ప్రాణేశ్వరా.

(దక్షిణాంతిక.)

నవనీత సనాభి మూర్తివై, పవిధారా పరిభావి గా మదిఁ [౫౦
సవరించితి సామి యేలొకో, వివరంబుగ వినిపింపుమా యుషకున్.

చిత్ర.—ఆయన నుపాలంభింప నేల! స్వప్నమే గదా. నీవృత్తాంతము ఆయన ఎఱుంగఁడేమో! అట్టియుదారప్రకృతులు దయాదూరములుగా నేరవు.

ఉష.—సత్యము సత్యము. నీ వెప్పుడును వివేకమంజూలవు. [ఆలోచించి] ఎఱుఁగనిచో ఆమహాభాగుఁడు ఈమందభాగ్యను సరకుగొనునా?

చిత్ర.—ఎఱిఁగినచో, 'ఈమందభాగ్యుని ఉష సరకుగొనునా' యని యామహాభాగుండును వచించును.

---

సుఱుమాడి — చింపివైచి.

౫౦ ప.—ఓసామీ, వెన్నతో బుట్టువైన రూపము కలవాఁడ వయ్యును నీహృదయమును మాత్రము వజ్రాయుధపు వాదరకన్న కఠినముగా చేసికొంటివే, అందుల కేమి కారణమో ఉష కయిన నాకు వివరించి చెప్పుము.

ఉష.—సఖీ నీ వాక్యాసనం బలుకుచున్నావు.

చిత్ర.—నే చెప్పుడును విషమునాల నుంటివిగదా.

ఉష.—నీ చిత్తము.

చిత్ర.—నీవల్లభుని యీమందిరమునకే ప్రాసాదమునకుం దెచ్చెద.

ఉష.—[కవుంగిలించి] ఏల నాతోఁ బుట్టవైతివి?

చిత్ర.—ఇంతటియనురాగము యుండదని.

ఉష.—[చిత్రరేఖం గవుంగిలించి ముద్దుగొని] నానాలంకృతజ్ఞతా జడమై యున్నది. ఏమియుం బలుకనేరకున్నాను. [ఆశ్చర్యముతో కవుంగిలి సడలించి] ఏమి యిది! నీయొడలును ఇంత వేఁడిగా నున్నది.

చిత్ర.—[నవ్వుచు] నీకౌఁగిట చాలసేపుంటిని గదా.

ఉష.—నిజము చెప్పవా?

చిత్ర.—[నవ్వుచు]

క. ప్రాణంబు గ్రాఁగనేనిఁక,
మేనుం దాఁ గ్రాఁగు టరుదె మేదినిలోనఁక?
ప్రాణమవు నీవు గ్రాఁగిన,
మేనను నేఁ గ్రాఁగితిని దమీరమణాస్యా. ౫౧

ఉష.—మృష వచించుచున్నావు. కానీ, తర్వాత ఎటుకుం బోయెదవు?

మదనికాకుముదికలు.—[ప్రవేశించి] ఇదిగో చందన క్షీరము.

చిత్ర.—ఉష యిప్పటికి స్వస్థపడినది. ప్రకృతము ఉషను తరువాత బరసికిం గొనిపోయి జలక మాడించి యీమదనప్రతిమను,—అహో! ఇందు కేలం బూవిల్లు వ్రాయ మఱచితిని! ఇదె వ్రాసెద. [అని అట్లు చేయుంట నభినయించి] ఈమదనప్రతిమను పూజసేయింపుఁడు. [అని యేకాంతము నుష

---

౫౧ ప.—తమీరమణాస్య=నిశానాథవదనా=చంద్రముఖీ.

చేతికిచ్చి] తర్వాత ఉషను మందాకినీప్రాసాదమున వదలుఁడు. నేను ఉషకు అప్రతిరుద్ధోపచారముం జెప్పెదను.

మద., కుము.—నీయాన.

చిత్ర.—ఉషా, నేను పోయి తెచ్చెదను. [అని పైకెగసి]

భుజంగ. జోహారో కపాలీ, జోహారో కరాళీ,
జోహారో గురూ, నాసుతకా బేకొలాంగికా
గోహారో కన్యను దగ్ధాంగు చెడ్డంబు దిద్దకా
మహామాయి, నాకు మహాసిద్ధి యిష్మా ౫౨

[అని నిష్క్రమించును. కరేణుక తొంగి చూచును.

మద.—రారమ్ము ఉషా, కర్పూరవనసికి. చిత్రరేఖ ఎవరో దేవత. ఆమెమాట మనము జవదాటఁగూడదు. [అని ముగ్గురు నిష్క్రమింతురు.

కరే.—[ముందటికి వచ్చి] ఉషకి యెండదెబ్బ తగిలిం దని నాతో మదనిక చెప్పింది. [నిర్వర్ణించి] యీతామరాకులపడక దానితాపాన్ని పోగొట్టిందిగదా. గంభీరయ్యామీదిమల్లెమూలంగా నావొళ్లు వుడుకెక్కిపోతూ వుంది. యీపరుపుమీద నేను చల్లబడతా. [అని యాతామరసెజ్జపైఁ బడి దొరలుచు] నాకు మొదలే వుషమీద మహాప్రేమ. దానికి నారాయడిమీద మనసు లేదుగనుక యిప్పుడు చెప్పాలికిందే లేదు. యీపరుపుకోసం కూడా నాకు దానిమీద ప్రేమే. [దొరలుచు] సీత్, యిది నా కేమూలకు? యి దేమి వేడిగావుందే! వోయి బాబో! రోగం వొకటే అయినా అందటికి వొకటే

---

౫౨ ప.—పునఃతదాల్ప స్థైర యోగివర్యుఁడా, నీకు నమస్కారము; చండీదేవి, నీకు నమస్కారము. ఓగురూ నారదమునీ, నీకు నమస్కారము. కోమలమూర్తి యయినయీరాజకన్యను ఉషను కాలిపోవున మన్మథుఁడు చంపుచున్నాఁడు. వాని చెడుచేఁతను దిద్దుటకై, ఓమహామాయాదేవీ, నాకు ఉత్తమమయిన ఆకాశయానాని కార్యసిద్ధిని అనుగ్రహింపుము.

మాత్ర పనికిరా దని మనువు ప్రద్యో లన్నారు. మాతత్త్వాలం పేరుగదా. అది సన్నగా తెల్లగా రోతేస్తూ వుంది. నేను గుండ్రంగా నల్లగా ముద్దొస్తూ వున్నాను. అయితే పైపలికి పేదయితే లోపలికి చలవట, చిత్రమూలంలాగ. తనకి లోపలికాక పోవడానికి వీట్ని తినేస్తా. [అని ఆగ్లీ చేసి] యింది నా శేయాలకి ! మాయింటికాడి పెద్దచెఱువులోపడి అందులో వన్ని తినేటి అవన్ని ళ్లన్ని తాగేస్తా. చన్నీళ్లకంటే చలవ మర్లేదు. పాడతా.

నేను గంభీరయ్య పెళ్లాడితే, బళి! నేను..., వవ్వా! నేను..., సెబాస్!
నే నాతడికి కూడు వొండిపెడ్తాను.
నన్ను గంభీరయ్య పెళ్లాడితే, బళి! నన్ను..., వవ్వా! నన్ను...,సెబాస్!
నాకాతనూ మంచి నగలు పెడ్తాడు.

వారలు నన్నూ నవ్వకుండా, బళిబళీ! వారు..., బాపురే! వారు...,
సరికి సరి గానె వాలి చిలిని. ,, సరి ... ,, సరి...
కొందఱూ జంటల లాగ, ,, కొంద... ,, కొంద...,
ఎందునా మేము పోరాడం. ,, ఎందు ... ,. ఎందు....
పొంతనా ల్వాళ్లకీ కు దరా, ,, పొంత..., ,, పొంత...,
అంతాను మాకూ కు దిరితే. ,, అంతా... ,, అంతా....
కదుపూ, కుదుపూ,
పలుపూ, ఖలుపూ, అంతా.... ,, ,, ,, ,,
జగడం, నగడం,
అరవడం, కరవడం, ,, ,, ,, ,, ,,
అన్నిటికి పైగా అడ్డగా పెరగడం ,, ,, ,, ,,

[అని వికృతనాట్యము లాడి నిష్క్రమించును.

ద్వితీయాంకము ముగిసినది.

---

# ప్రవేశకము.

స్థలము:—ద్వారక, శ్రీకృష్ణప్రాసాదోద్యానము.

ఉద్యానపాలిక ప్రవేశించి
తోట నలంకరించుచుండును.

ద్వితీయ.—[ప్రవేశించి] ఓసే బంభరికా, యేమే శుభ్రంగా యీతోటని అలంకరించకున్నావు, కొమారమహారాజు అనిరుద్ధులవారికి మరీ యిష్టమైనతోట గదటే యిది!

బంభరిక.—ఓసే కీరవాణీ, నీపని రవ్వంత ముంగట అయిందని యేం బడాయే నీకు! యిదుగో ముగించాను చూడు. మరి మొన్నడిగితే ఆనక చెప్తానన్నావే యిప్పుడు చెప్పు, మునుపంతా యెప్పుడో యిక్కడికొచ్చే కొమారమహారాజు యిప్పుడు రోజల్లా వొంటరిగా యీతోట్లోనే తిరుగుతూవుంటాడే అదేమిటి?

కీరవాణి.—ప్రభువులచిత్తానికి కారణం యెందుకే!

బంభ.—మరి, చక్కవపిట్టలని జతలుకట్టి వాటిమీద యేమిటేమిటో చిత్రాలురాస్తాడే అదెందుకే?

కీర.—నువ్వెరగవటే? వీటికోసమే.

[అని బంభరికపాలిండ్లం బొడుచును.

బంభ.—ఎగతాళటే?

కీర.—కాదు దిగతాళే. ఎవతెమీదనో మనసుపడ్డాడే.

బంభ.—పడితే?

కీర.—ఆమెవి అవే యివని వీటికి అలాగ లంకారాలు చేస్తాడు.

బంభ.—కొమలిపిట్టలన్ని పట్టుకొని వాటికంచెలు దువ్వి వాటికి పువ్వులు ముడ్తాడే అదెందుకూ?

కీర.—వొకటి చెప్తే కడమన్ని తెల్సుకోలేవటే? ఆమెతలకట్టు తలుచుకొని వీటికి సేవలు చేస్తున్నాడు.

బంధ.—శబాస్ శబాస్. మరి ఆగుడ్డిచెంబడికి వాళకాద తెలవనీకుండా వాడిగాలానిముల్లు తీశేశి వృత్తతాటికి జిలేబీలు కట్టినాడు నిన్న, వాడికి తెలవనీకుండానే వాడిబుట్టలో కొరాలుకొట్లం వేశినాడు.

కీర.—చాపలు ఆబాగ్గెమంతురాలికళ్లలా గున్నాయంట. అటుపైని తెల్సునో. చాపలు పడకుంటే ముసలివాడికి మెదుకు ల్లేవని కొరాలు పడేసినాడు.

బంధ.—నువ్వెక్కళ్లో మడకని పడ్డావే.

కీర.—రాయే లంజా, నువ్వు కూడా పడుదుగాని.

బంధ.—యింకొకటిమాత్రం చెప్పు. ఆవాళలోకి దిగి ఆయన కొందుకే ఆసుళ్లని వెతికి వెతికి ముద్దెట్టుకొంటాడు ?

కీర.—చాల్లే యీపాటికి. నువ్వెవణ్ణయినా కౌగరంగణ్ణి తగులుకొని రాత్రి వాణ్ణడుగు చెప్తాడు. నీకేమి చీకటిబయ్యం లేదటే ?

[అని నిష్క్రమింతురు.

ప్రవేశకము ముగిసినది.

---

మడకని = మడకలో = అరకలో. మడకని బడ్డావే = పురుషునిం బొందితివని భా.

# తృతీయాంకము.

స్థలము:—మునుపటిదే.

చిత్రరేఖ ఆకాశయానమున ప్రవేశించును.

చిత్ర.—ఆయుద్యానపాలికల సంభాషణవలన కుమారమహారాజు అనిరుద్ధుండు విధన్యురాలికొఱకే విరాళిం గూరుచున్నాఁడని తెలిసెంగదా. తిరస్కారిణీప్రభావంబున రాచనగరు సొచ్చి యామహాపురుషుం గంటిని. విరాళిచే వాడి వత్తియయ్యును సాయంపాసనలు చేతస్సమాధితో యథావిధి ఒనర్చి కృతాహారాభినయుండై శయనం బొల్లక యీయుపవనికే యేతెంచుచున్నాఁడు. తటివేదికానిపోయెదంగాక. ఈవిరాళి నా ప్రాణసఖికొఱకే యగును. [చదలం గాంచి] అహా! యీ చంద్రుఁ డింత రమణీయుండయ్యును వేఁచును కదా!

అనిరుద్ధుఁడు విరహకృశుండు ప్రవేశించును.

అని.—[నిట్టూర్పు పుచ్చి] హా! ఈవెన్నెలకు చలువగుణము వెండియు నెన్నఁటికిఁ గలుగునో! అహాహా!

(ఔపచ్ఛందసికము.)

విరహార్తుల ద్వేషి నై దహించున్,<br>
విరహాతీతుల నెయ్యుఁడై భజించున్.<br>
'పరికింతు రవస్థ' నన్న సూక్తిన్<br>
బరమార్థంబుగఁ బద్మవైరి సేయున్. 43

---

43 ప.—ఈచంద్రుఁడు విరహపీడితులను శత్రుఁడై కాల్చును. విరహము దాఁటినవారిని మిత్రుఁడై సేవించును. 'లోకులు మనుష్యుని వానియవస్థకు తగినట్లు చూతురు,' అనఁగా, 'బలవంతునికి మ్రొక్కుదురు, దుర్బలుని గొట్టుదురు;—అన్నసుద్ది వాస్తవ మని ఈచంద్రుఁడు తననడవడిచేత నిరూపించుచున్నాఁడు.

చిత్ర.—ఓహో! సత్యము సత్యము.

అని.—ఓయి చంద్రుఁడా, నీపగకుఁ గారణము తెలిసినది?

నిరతజ్యోత్స్న మటంచుఁ దద్వదనముల్ నే మెచ్చుటం జేసి కా
యరవిందాహిత నన్నుఁ జూఁడెదవు నీహస్తాగ్రదీపార్చులన్;
శరముల్ సూదులు బాఁకు లీఁటెలు కళల్ సారింతు నాపై; నహో!
ధరలోనన్ నిజ మాడ నిష్ఠురము కాదా! సామెతల్ దప్పునే. ౫౮

చిత్ర.—'నిరతజ్యోత్స్న మటం చుషావదనముల్' అనఁడాయెనే!

అని.—ఓయి కళంకీ,

చోక్కంపుంగలశాబ్ధిపట్టి కెటు వచ్చున్ మచ్చ! నీగుట్టు నే
వక్కాణించెద:—నంశునాళకము నావక్షంబునన్ నాటి, నీ
వక్కాంతాస్యము దోఁపమిన్ రగులు నాస్వాంతంబు గంజాయిగా
హుక్కాగ్రోలుచుఁ బొంగ ల్మాగంబలమె నం;చోతుగ్రమాన్వేఁలుపా.

---

౫౮ వ.—సదా వెన్నెల గలయట్టి దని ఆ ప్రాణేశ్వరిముఖమును నేను మెచ్చినందునఁ గదా ఓకమలవైరీ, నన్ను నీచేతికొన నున్న దివ్వెజ్వాలలతో (నీకిరణముల తుదలజ్వాలలతో) కాల్చుచున్నావు; నామీఁద బాణములు... కొరడాలు ప్రయోగించుచున్నావు. అయ్యో! భూలోకమున నిజ మాడిన నిష్ఠుర మన్న సామెత తప్పదాయె, గదా.—చంద్రునికి రాత్రియేగాని పగటి వెన్నెల లేదు, ఉషావదనమునకు వెన్నెల రేలుం బవలుం గలదు, కావున అనిరుద్ధుఁడు చంద్రునికన్న ఉషావదనమే ఉత్కృష్ట మని మెచ్చినాఁడు... విరహబాధలో చంద్రుఁడు నీయుం నుద్దీపనమును అనిరుద్ధుఁడు సహింపఁ జాలకున్నాఁ డని భా.

౫౯ వ.—పరిశుద్ధుఁ డైన క్షీరసాగరుని కుమారునికి నీకు ఈకళంకము ఎట్లువచ్చినది? (ఇది నీపుట్టుకతో వచ్చినది కా దని భా.) నీ రహస్యమును నేనుచెప్పెదను విను. నీవు తురకలదేవుఁడవు కావున సాఁగిపలికె హుక్కా-

చిత్ర.—ఆహా! ఎంతసరసోపాలంభము!

అని.—అయ్యో, ఓషధీశ్వరా, నీవు ముగ్ధుఁడవో ప్రౌఢుఁడవో.

సతముఁ రోహిణిఁ గూడ లేనివనటన్ జాలిఁ జెందు నీవే యిటుల్
వ్రతమో నాఁగ వియోగిపాళికయి నావాల్ నూఱవింతే శశీ!
మతమో నీకును నోషధీశుఁడ భిషఙ్మర్యాదగా సృష్టిలో. [సీ.
నితరప్రాణులగాయ మవ్యథము నీదే దుర్వ్యథాఢ్యంబుఁ గాఁ.

[గాలి సోఁకినందులకు ఒడలు జలదరించుట నభినయించి] ఓయి మలయానిలా, ఏల నన్ని ట్లేఁచెదవయ్యా?

ఆ. చలువతెమ్మెర యను పలుకు దబ్బఱ సూవె;
దక్షిణుండ వనెడుతత్త్వ మిదిగో;

---

త్రాగెదవు. నీవు శీకరణ మనెడుహుక్కాగొట్టమును నాహృదయములోఁ గ్రుచ్చి, ఆ ప్రాణేశ్వరి వదనము నా కగపడ నందుకై రగులుకొనుచున్న నా హృదయకమలమే గంజాయిగా హుక్కాత్రాగుచు పొగను వెలిఁబుచ్చుచున్నావు; ఆపొగ నిన్నావరించినది, అదియే నీమచ్చ.

ఉపాలంభము=నింద. ఓషధీశ్వరా=ఔషధుల మొలకల దొరా. ముగ్ధుఁడవో = తెలియనివాఁడవో.

సీ. ప.—అన్ని తిథులయందును నీ ప్రియతమ యైన రోహిణితోనే కూడియుండమిచేఁ గలిగిన దుఃఖముచేత చచ్చునట్లుగా కృశించుచున్న నీవే వియోగులను బాధించుటకై దీక్ష వహించితి వేమో యనునట్లుగా వారిని హింసించుచున్నావు! ఇది వింతగానున్నది. లోకములో ఓషధులను వినియోగించువాఁ డగు వైద్యుఁడు తనప్రాణంపుఁగోఁతయే సహింపరాని నొప్పి గాని ఇతరుల ప్రాణముం గోసిన నొప్పి యేమియుం లే దని తలంచినట్లు నీవును ఓషధులకు దొరవు గాన వారిపట్లనే అభిప్రాయపడియున్నావా?

విరహి జనుల జీవ వితతి నువ్వెత్తుగా
నూఁదిపైచు జముని యూర్పు నీవు. ౫౭

చిత్ర.—అయ్యో! సుకుమారుఁడు ఎంత గాసిలుచున్నాఁడు!

అని.—రహస్యము దాఁచుట యనుపుటపాకమున నెంతకాలము వేఁగుదును? బిగఁబట్టిన యూపిరిని సడలించుట గదా రహస్యము చెప్పికొనుట? వయస్యుఁ డేనియుఁ గనఁబడఁడుగదా?

చిత్ర.—అయ్యో! కుమారమహారాజు మనోవిరహతాపమునం బొగులుచున్నాఁడు! [మఱియొకదెస నిర్వర్ణించి] ఈతఁ డెవరో విప్రకుమారుఁడు ఇతనిమిత్త్రునువలె నున్నాఁడు. ఇతనిం గడుం గూర్మితో వెదకి వెదకి కనిపట్టి హర్షపరవశుఁడై పరుగునవచ్చుచున్నాఁడు.

విదూషకుఁడు ప్రవేశించును.

అని.—[చూచి] అహా! నాఁడాయనా, కూర్చుండుము కూర్చుండుము.

విదూ.—వయస్యా, నీ వేమి యీవొంటిపాటును వెళ్లఁడినావా? ఈమెకోసం మమ్మల్ని వదిలేశావే?

అని.—దుఃఖితుఁడు మంచిసహవాసము గాఁదగని మిమ్ముం గూడనైతిని.

విదూ.—దుఃఖితుడికి దుఃఖితుడు మంచిసావాసమే గదా.

అని.—కానీ ;

విదూ.—అటయితే మనసవాసం మంచిదే.

అని.—ఎట్లు?

విదూ.—నిన్ను చీమ కుట్టిందో దోమ కుట్టిందో ఆదుఃఖం నీకు, నిన్ను చూడనిదుఃఖం నాకు.

---

౫౭ ప.—తెమ్మెర = గాలి ; దక్షిణుండు = దయగలవాఁడు (దక్షిణ దిక్కువాఁడు)—నీ దక్షిణత్వము యథార్థమందు లేదు ; వితతి = సమూహము ; ఉవ్వెత్తుగా = [illegible] ; జముని = దక్షిణదిక్పతియైన) యమ ధర్మరాజుయొక్క - ఊర్పు = శ్వాసము.

అని.—నన్ను ఏమయుం దోషము పుట్టినదా ?

విదూ.—మరి నీకు దుఃఖ మేమి? పడకలో నల్లి కుట్టిందా? తల కాయలో యెవతెనైనా పే నేమైనా కుట్టిందా ?

అని.—ఛీ! మూర్ఖా!

విదూ.—అవును, మ రేమి దుఃఖకారణం ?

అని.—ఏల యడిగెదవు వయస్యా!

విదూ.—[ఆటోపముతో] చెప్పకపోతివా జంధ్యాలు పురి పోసుకొని నీకు బ్రహ్మహత్య కడతా.

అని.—అంతపని చేయకు. నీపరాక్రమము నే నెఱుంగుదును. చెప్పెదను.

విదూ.—చెప్పు మరి.

అని.—మదనసర్పము కఱచినది, విష మెక్కినది.

విదూ.—మదన మంటే నాకు తెలియదు. విజాతో మన పిల్లతో చెప్పు, మంత్రం వేస్తా.

అని.—వయస్యా, నే నొకనాఁడు కలలో నొకజగన్మోహినిని వరించితిని.

విదూ.—[పకపక నవ్వి] ఆవేళ వుండ వేసుకొన్నావా యేమి!

చిత్ర.—ఈయనకును కలలోనే గాంధర్వము! అహో! సంవిధానము!

అని.—[విదూషకుని చేయి పట్టుకొని] కుదురుగా వినియెదవా లేదా?

విదూ.—అయ్యో, అయ్యయ్యో, అమ్మ కొక్కణ్ణి, అబ్రంహణ్యం అబ్రంహణ్యం! నన్ను బ్రహ్మహత్య కట్టొద్దన్నావే, నీవే ఆరంభించా వేమి మహారాజా!

అని.—[చేయి వదలి] కలలో వరించి మేల్కొని కానక యీయవస్థకు వచ్చినాఁడను.

విదూ.—(పక పక నవ్వి) వొకనాడు నేను మంథానభైరవం మింగి బొమ్మపిల్లి కలలో మిఠాయికొండ వొకటి నే నొక్కణ్ణే తిని, మునపటికంటే

---

మంథానభైరవము=ఎంతభక్షించినను చాలనట్లుగా చేయునట్టి యొకమందు.

ఎక్కువ ఆకలితో మేలుకొన్నాను. అప్పట్నుంచి పదిహేనురోజులు ఆ కొండే కావాలని ఇంట్లోవాళ్లని యేడిపించాను. పదహారోనాడు పెదనాయన నాతో చెప్పకుండా జుట్టు పట్టుకొని పేపావారిపిల్లని నాకు పెళ్లిచేశాడు. ఆమహోత్సవంలో మిఠాయికొండని మరిచిపోయి స్వస్థపడ్డాను. నీవున్ను నా దారికే వొస్తూ వున్నావు. ఎటయినా నావయస్యుడివే గదా.

అని.—తిన్నగా వినియెదవా లేదా?

విదూ.—వున్నమాట చెప్తావా లేదా? కలంటేమాత్రం నేను నమ్మను. కలకోసం వొకడు నీలాగ యేడుస్తూ వుంటాడా? పాడుకలొస్తే తుష్టొస్తే అప్పుడు రవంతసేపు యేడుస్తాడు.

అని.—సత్యము వయస్యా, నామాట.

విదూ.—అట్టైతే అదేదో పిశాచం. కామినీ మోహినీ శాకినీ ఢాకినీ బడబాకినీ దయ్యాలలో ఒకటి. ఆకథ వింటే నన్నుకూడా ఢాకిని వెంబడిస్తుంది.

అని.—మిత్త్రనిమాఁదియాఁగను కత్తితోఁ గొట్టుక్రొఁతివి నీవు.

విదూ.—[బెంగము చిట్లించుకొని] నీవో, పెళుక్కుని వొచ్చినందుకు వేళ్లు నలిపి బ్రహ్మహత్య చేశే రాజాధిరాజవు. [మందహాసముతో] పోనీగానీ, అట్టైతే, కూచా తప్పకుండా ఆమెస్వరూపాన్ని వర్ణించు, నాకు నాటొస్తుందేమో చూస్తా. నిజమైతే అసలే నేను చూడకపోతానా?

అని.—మంచిది, నా కిష్టమైనపనియే; వినుము.

విదూ.—సిద్ధము. అందుకే చెవులు చికిలిచేసుకొంచున్నాను. [అని చెవులు దీటుకొనుచు] ఇందుకు బదులు పేపావారిపిల్లని నేనూ వర్ణిస్తాను. అది నువ్వు వినకపోతే యిది నేనూ వినను.

---

పేపావారిపిల్ల యనఁగా ప్రేఁకబెత్తము, దానిని పెండ్లిచేయుంట యనఁగా దానితోఁ గొట్టుట.

అని.—

ఆ. చిమ్మచీఁకటులను జిమ్మి పవ ల్సేయు
మోహనాంగిముద్దు మొలక నగవు;
రమణిమోము మోళ్లె రాకామృగాంకుండు
కాముఁ డెత్తు దృష్టిఘటము సూవె. ౫౧

విదూ.—ఇదే మో అపూర్వమే. మరి మా పేపావారిపిల్లకి తుక్కతల, పూనకళ్లు ఎంతస్వారస్యంగా చెక్కివున్నవి! వయస్యా, అటుపైన?

అని.—వయస్యా,

ఆ. సంజవేళ లేఁతజా జొంది చుట్టురాఁ,
జలను చదలినీఁడఁ దాల్చి సుంత,
జంట నొప్పు దొడ్డ జమ్మేటి బుగ్గ లా,
కొమ్మ గబ్బిగుబ్బ కోరకములు! ౫౨

విదూ.—బలిబళి! మా పేపావారిపిల్లకి [అనిరుద్ధుఁడు విదూషకునికిం దెలియనీక పొపుఁలు మూసికొనును.] అవి లేవు. మెడలో రెండుపట్టుకుచ్చులు మాత్రం వేలాడుతున్నవి, వయస్యా, ఇంతేనా!

అని.—విను వయస్యా,

---

౫౧ ప.—రాత్రి ఆ మోహనాంగియొక్క ముద్దు లేఁతనవ్వు చేత గాఢాంధకారముం బాసి పట్టపగటివలె వెలుంగును; నిండుపున్నమచంద్రుఁడు ఆమె ముఖమునకు దృష్టి తగులకుండుటకై మన్మథుఁడు నిలిపిన దృష్టిపిడత సుమా.

౫౨ ప.—అకోమలియొక్క మొగ్గలవంటి నిండు గుబ్బలు—సంధ్యా కాలమందు తమచుట్టును లేఁతగా ఎఱుపుం బొంది, తమతలయందు ఆకాశపు నీలిమయొక్క ప్రతిబింబము గొంచెము కలదై, జంబూనదిలో జంటగా నొప్పు చున్న పెద్ద బుడగలా ఏమి?

చందున కాత్మబింబసదృశంబుగ గుండ్రకవల్ జనించి యా
పింఁడెలు చుక్కగా నడుమ బింబములన్ జిఱుమచ్చ దాల్చి పైఁ
బొందుగ జాభరారసము మూర్తుల లేఁతగ నద్దికొన్న నా
సుందరిగబ్బిగుబ్బకవపోయగ మొందెడి నేమొ మిత్త్రమా. ౬౦

విదూ.—అసిల్ల మూలంగా శివీశ్వరుడివై పోతున్నావేమి వయస్యా! చెడిపోతావు సుమా! పోనీ ఆమెబాహువు లెటువంటివయ్యా?

అని.—

క. తాఁకియుఁ దాఁకనిమాత్రన
యేకపదమ వింతమోహ మిడుమగుని ప్రసూ
నాకలితపాశ రాజము
లాకోమలిబాహువల్లు, లలవియె చెప్పన్! ౬౧

విదూ.—అ దేదో పిశాచ మని నేను మొదటనే చెప్ప లేదా. మా పేపావారి పిల్ల మాత్రం [అనిరుద్ధుఁడు మునుపటివలెనే చెవులు మూసికొనును.] మదనపాశంలాగ లేదుగాని యమపాశంలాగ వుండినది. మొత్తానికి పోలిక వుంది. బలిబలి! కనకనే నీకింత వెఱ్ఱిపట్టింది. ఇంకా? ఆబొబ్బట్టుమడతలను వర్ణించవయ్యా.

౬౦ ప.—చంద్రునికి తనబింబమునకు పోలికగా ఇరువురు కవల పిల్లలు పుట్టి, లేఁతపింఁడెలవంటి ధూళికవలు దేహమధ్యమందు చిన్నమచ్చను గుండ్ర మయిన చుక్కగా ధరించి, పైఁగా చక్కఁగా జాభరాద్రవమును లేఁతగా తమమూర్తులకు అద్దుకొన్నయెడల అప్పటికి ఆకవలు ఆసుందరియొక్క నిండు పాలిండ్ల సౌభాగ్యమును పొందు నేమో.

౬౧ ప.—ఏకపదము=ఒక్కుమ్మడిగా. మోహము=పరవశత్వము. ఇదు ...జములు = కలిగించునట్టివి పుష్పములతో చేసిన మన్మథుని పాశాయంధ శ్రేష్ఠములు.

అని.—వినుము మిత్త్రమా;

హృదయజుఁ డాత్మకామినికి నీఁతలు నేర్పుటకున్, దదర్థమౌ
మృదుచరణావతారమున మెచ్చొదవన్, బరువంపుమంత్రి వే
పదిలము సేయు డిగ్గియయు, బంగరుఁదాపలు, నీలిమొష్మాలు
స్ఫదవసనంబుఁ గా, దయితనాభియు, ముత్తఱు,లారుఁ, జెన్నగున్.

విదూ.—[అనిరుద్ధునిచేయి పట్టుకొని] బాపురే! బాపురే! వయస్యా మూడుముడతలకే యింతవర్ణనైతే మాపేపావాఁడిపిల్ల వెనకనుంచి కాగలించుకోగానే నావీపంతా వళ్లే, అది తగిలినచోటంతా వళ్లే! అందు కెంత వర్ణన కావలెనో?

అని.—ఎంత తెలియనివాఁడవు వయస్యా!

విదూ.—[కనికరముతో] మన్నించు వయస్యా, యిక ఆపిల్లని వర్ణించను.

అని.—ఇట్టియాచెలువ నేపథ్యము—

(పంచచామరము.)

మృషానలగ్న జిల్గుసైఁట మించుసన్నమం చగున్;
ఝషాంకదత్తమన్న సంజజాజులోని రేకగున్.

టీక.—ద్వారమున మన్మథుఁడు భార్య యయిన రతీదేవికి ఈఁతలు నేర్పుటకుఁగా యౌవన మనుమంత్రి నిర్మించిన దిగుడుబావివలె త్రిక్కులియు, అందులో దిగునప్పుడు మెచ్చుగలిగించుటకై మృదువుగా నుండునదిగా కట్టించిన బంగారపుమెట్లవరుస వలె వళిత్రయంబును, ఆమెట్లవరుసపై పాదములకు ధూళ్యాదిక మంటకయుం మృదువుగాను నుంచుటకై దారిగా పఱిచినట్టి నల్లమొహాములుకట్టు రేకులవలె ఆ తరుణీమణి నూఁగారును ఒప్పుచున్నవి.

నేపథ్యము—అలంకారము.

తృషాకృధోక్షిభూషణాళి రిక్కలున్ మెఱుంగులా ;
నుషావతార మంచుఁ గాంత నూహ సేయుదున్ సఖా. ౬౩

చిత్ర.—ఆహాహా! ఉషావతార మనుకొన్నాఁడు! ఉషయే యని తెలియఁడు!

అని.—అట్టియాజగన్మోహిని.

ఆ. అట్లుగానె పుట్టినట్లుగా నగపడు ;
నోలి నెదిగె ననుట యొప్ప రాదు ;
మార్పువొందురీతి మదిలోనఁ దోఁపదు ;
అసురమాయొ కొమ్మ యమరమాయొ! ౬౪

చిత్ర.—ఉభయమాయ సుమా.

అని.—అట్టి యీముద్దుగుమ్మ నన్నుఁ దేల్చినయాముహూర్తము నా జన్మములో నెట్టిదో చెప్పవలయునా?

విదూ.—[ఆత్మగతము] వయస్యునిదుఃఖ మేమో వాస్తవంగా మేర మీరిందిగా వుంది. అయ్యో పాపము! అట్టి కన్య వుండునా? కలలు నిజంగా ఫలించునా! [ప్రకాశము] వయస్యా, వగవకు. నీకు మేలు కలుగుతుంది.

---

౬౩ ప.—మిథ్యామధ్య (అనఁగా నడుము లేనిది) అయిన యీచెలువ యొక్క సన్నని పయ్యెద ప్రకాశమాన మయిన సన్నని మంచుగా నగపడు చున్నది. (తెల్లనిది), అమీనసయనయొక్క పావడ యన్ననో సంధ్యారాగములోనుండి కత్తిరించిన రేకుగా నున్నది (జాళరాపన్నది), అనఁగొల్పునట్టి కాన్తిగలదైన యీతరుణియొక్క నగలవరుస నక్షత్రములు మెఱుపుదీఁగలుంగా నున్నది. కావున ఆకాంత రాత్రియొక్క యవతారమని నేను తలంచుచున్నాను.

౬౪ ప.—ఓలిన్ = క్రమముగా. అసురమాయొ = అసురలక్ష్మియొ. అమరమాయొ = దేవలక్ష్మియొ.

వయస్యా, నీవర్ణనలచేత ఆమెను నేను తర్వాత యేలాగ అనవాలు పట్టగలను?

అని.—ఇదిగో ఈశిల్పముచే తెలియఁగలము.

[అని చిత్రఫలకము నిచ్చును. విదూష
కుఁడు చూచి ఆశ్చర్యపడును.

చిత్ర.—[నిర్వర్ణించి] ఆహాహా! నాప్రియసఖియే కన్నులయెదుట నగపడుచున్నది! ఏమి యీశిల్పనైపుణి! ఏమి నాచెలిభాగ్యము!

ఆ. మణియుఁ దేజుఁ, జందమామయు వెన్నెల,
వేగుతఱియు వెల్గు, విరియు వల్పు,
నెట్లొ యట్టు లెనయు నీయిర్వురం గూర్చి
బ్రహ్మ వేదజడతఁ బాసె నిపుడు. ౬౫

విదూ.—[నిశ్వసించి, ఆత్మగతము] యిటువంటి, సృష్టి వుంటుందా? [ప్రకాశము] వయస్యా, నాచపలబుద్ధిని మన్నించుమా. ఘరి యీమెను యథావిధిగా పెళ్లి చేసుకోరాదా?

అని.—ఎవ్వతెయో తెలియదు, మిత్రమా!

విదూ.—అయ్యో! నిజంగా నీవు అపస్మిడవే వయస్యా!

చిత్ర.—ఇరువురయవస్థయుం జూఁచినట్లు సమానముగా నున్నది!

అని.—వయస్యా,

ముదితారత్నముమోముగాంచునపు డామోమేగనంజొచ్చితిక్;
మదిరాక్షిద్యుతిఁ జూడఁజొచ్చిన నదే మాద్యద్దశ జూచితిక్;

౬౫ ప.—తేజు = కాంతి. వేగుతఱి = తెల్లవాఱువేళ. విరి = పువ్వు. వల్పు = పరిమళము. ఎనయుం = సరిపోవునట్టి. వేదజడతక్ = వేదాభ్యాసజడుఁ డనునపకీర్తిని.

సుదతిఁ జేరఁడుగఁ గులంబుఁ దెలియఁ నున్న గ్యో నా తెల్వి; హా!
యిదిగోఁ బండిదిగో వ్రాలిక్కయని నన్నేఁచెన్విధాతృండయో.

[దక్షిణోరుస్పందము సూచించి] వయస్యా, నా కుడియూరు వదరు చున్నది.

విదూ.—నీ కిప్పుడే మళ్లీ ఆజగన్మోహినిపొందు కలుగుతుంది. త్వరగా యింటికి వెళ్లి నిద్రపోయి కల గను.

అని.—అంతపుణ్యమా? అయినను బ్రాహ్మణవచనమును పరిగ్రహించి తిని. [అని చిత్రఫలకమును వక్షమం దుంచుకొని కన్నులారం గాంచి, యున్మాదంబున]

(దక్షిణాంతిక.)

నవనీత సనాభి మూర్తి వై, పవిధారా పరిభావిగా మదిఁ [౬౭
సవరించితి చామ యేలొకో, వివరంబుఁ వినిపింపుమా దయఁ.

విదూ.—ఏమి యిది వయస్యా, వుత్తచిత్తరువేగదా, దీని కెందు కింత మనివి?

అని.—అయ్యో! చిత్తరువేనా! హా ప్రాణేశ్వరీ! [అని మూర్ఛిల్లును.

విదూ.—వయస్యా, వయస్యా. హావా! ఏమిచెయ్యవొచ్చును! అయ్యో చిత్తరువని నే నెందు కన్నాను! పాపాత్ముడను మృత్యువులాగ నే నెందు కొచ్చాను! [ఆలోచించి] కానీ యీవాకలోనుంచి తామరలు నీళ్లు తెచ్చి తేరుస్తా.

[అని పరుగునం బోయి తామరలు
కోయుట నభినయించును.

---

౬౬ ప.—మదిరాక్షిద్యుతిఁ=మాదకములైన కన్నులకాంతిని. మూర్ఛద్దశఁ=మత్తెక్కుచున్నవాఁడనై. సుదతిఁ=అయ్యువతిని. విధాతృండు=బ్రహ్మ.
౬౭ ప.—చామ=ఓ యింతీ.

చిత్ర.—ఇదే సమయము. [అని యనిరుద్ధుని ఆకాశవీథికిం గొనిపోవును.

విదూ.—[శీతలోపచారోపకరణములు తెచ్చి] వయస్యా, వయస్యా, [అని కడుంగడు వెదకి] యెక్కడా లేదు. [క్రింద చూచి] యీచిత్తరువు పలక యిక్కడనే వుంది. [అని ఫలకముం బుచ్చుకొని] వయస్యు డేమయినా నేను వేళాకోళంగా అన్నమాటప్రకారం నిద్రపోవడానికి యింటికి వెళ్లాడేమో! అక్కడికే వెళ్లి విచారిస్తా. అక్కడ లేకపోతే యీచిత్రపుపలకని శ్రీకృష్ణులవారికి అప్పగించి యీవృత్తాంతం వారికి విన్నపంచేస్తా.

[అని పరుగున నిష్క్రమించును.

చిత్ర.—ఈపలకముచేత ఉషాస్వరూపము శ్రీకృష్ణాదులకు తెలియ నగునుగాక, నాతిరస్కరిణిచే నితండును విదూషకునికిం గానరాఁడయ్యె. నా సమ్మోహినీవిద్యచే నీయున ఉషచేయి తగులువఱకు ఇట్లు మూర్ఛామగ్నుఁడు గానే యుండును. మహావిద్యా, మందాకినీప్రసాదమునకుం గొనిపొమ్ము. [అని ఆకాశగమన మభినయించి] ఆహా విద్యాప్రభావము!

ఇఁకియఁగ సుద్ద గీఁచినవిధిఁ బుఱిణించెడి రిక్క మొత్తముల్,
కఱిజలదాళిలో మెఱపు క్రాలుగతిన్ దివి నేఁ జెలంగెదన్,
బిఱబిఱ వర్షగోత్రపృథివీధరవర్గముతోడ ధాత్రియున్
వఱలు దవిష్ఠ యై తఱిమెనం గవబొంగర ముల్లుకైవడిన్. ఉలా

ఉలా క.—నక్షత్రసంఘములు ఒక చిన్నని గీఱప్రక్క మఱియొక చిన్నని గీఱగా సుద్దతో గీఁచినట్లుగా తెల్లని చిన్న గీఱలుగా కనఁబడుచున్నవి. నల్లని మబ్బులలో ఈమూలనుండి ఆమూలకు మెఱుపుదీఁగ మెఱసినట్లు నల్లని యాకాశములో నేను మహావేగమునం బోవుచున్నాను. భూగోళము నాకు అతిదూరమై రెండువ్రేళ్లను మలికిచేయఁదగిన జంటబొంగరము తిరిమెనలో తిరిగినట్లు వర్ష పర్వతములతోను కులాచలములతోను గిఱగిఱం దిరుగుచున్నది.— బొంగరములో త్రాడుచుట్టెడు నఱదలవలె భూగోళముమీఁద పర్వతము

ఎట్టి దైవసంవిధాన మిది!

క. పువ్వువింటిసోఁకుబారికి,
జవతప్పినచెలియ కిట్టిసంజీవమణిన్
దివిఁ గేలఁ దెచ్చిరే సఖు,
లెవ రేనియు నెందునేని యెన్నండేనిన్. ౬౯

ఈమణిని త్వరగా ఉషకు నిచ్చి కృతార్థనయ్యెద.

[అని నిష్క్రమించును.

తృతీయాంకము ముగిసినది.

---

ఉన్నతావు మిట్టగాను లేనితావు లోఁతుగాను ఉన్నవని భా. కడమ సాటిని ఆలోచించుకొన వచ్చును.

౬౯ క.— పువ్వువింటిసోఁకు బారికిన్ = పూవిలుకాఁడగువాఁడు పిశాచుని బాధకు. ఇట్టి సంజీవమణిన్ = ఈయనిరుద్ధునివంటి జీవనప్రదుని. దివిన్ = ఆకాశమార్గమున.

# తురీయాంకము.

---

స్థలము I.—శోణపురి, బాణుని సభామంటపము.

కరేణుక ప్రవేశించును.

కరే.—[ఒకపండ్లపాణకను నిర్దేశించి] యీపళ్లపాణకలో దూరి వుండి నాముద్దలరాయణ్ణి, సభలో యేలాగ ఠీవిగా వుంటాడో చూస్తూ వుంటాను. నా రాయడు కూర్చునేయీకుర్చీలో వాళ్ళొచ్చేదాకా కూర్చుంటా. ఇదైతే నాకు సరిపోతుంది. నౌకర్లంతా నాపక్షమే. నామీద యెవ్వరూ కొండ్యాలు చెప్పరు. [అని పెద్దయాసనమునఁ గూర్చుండి దానిని ముద్దు పెట్టుకొని] ఆయన ముందొస్తే నేను లేవకుండా గర్వంగా వుంటా.

గంభీరవేది ప్రవేశించును.

గంభీ.—యీరోజు రెండిట్లో వొకటి సిద్ధాంతం అవుతుంది. యేలాగయినా యీపెళ్లి నాకు తప్పునా యీశ్వరా! [నిర్వర్ణించి] యే మిదీ! నాకుర్చీలో గడ్డేమిటి! [వెండియుం నిర్వర్ణించి] కాదు కాదు, కరేణుక! కరేణుకా.

కరే.—[గర్వముగా] అక్కడ కూర్చో.

గంభీ.—మనకి ఒకరొకరికి సరిపడే ఆసనం యిదొకటే.

కరే.—నువ్వు ముందర వొచ్చావేమీ?

గంభీ.—నువ్వు ముందర వొస్తావనే?

కరే.—ఏపెళ్లి తప్పాలని మొక్కులు మొక్కుతున్నావు?

గంభీ.—కృష్ణకీ నాకూ.

కరే.—నీకూ నాకూ గాదు గదా.

గంభీ.—కాదు.

కరే.—అయితే ఆకలుపేశొచ్చి నన్ను కౌగిలించుకొని నాకు ముద్దియ్యి.

గంభీ.—[పోయి తలుపువేయుంట నభినయించి వచ్చి] రా మరి.

[అని యిరువురును స్థౌల్యంబుచేత చేతులు కడుపు చుట్టు రానందున ఒండొరులం గౌగిలింపలేక మాని, ముద్దిడుకొనంబూని కడుపు లడ్డపడుట చేత సాధ్యపడక ఎంతయు యత్నించి భగ్న మనోరథు లగుదురు.

కరే.—యిది మనవల్ల గాకపోతే పోనీ. యిప్లరం చెట్టాపట్టాలు కట్టుకొని నాట్యమాడదాం రా. [ఇద్దఱు ఆడుచు పాడుదురు.

(గేయము)

ఆకలైతే వెళ్లి ఆడాడ తారాడి [మాను...
మానుసులను మింగి మాయంచేతాం, మాయం...మాయం...
చూడియేనుగడొల్ల చొక్కా తొడుక్కొని
మంచు కొండకివెళ్లి మళ్లీవొత్తాం, మళ్లీ...మళ్లీ...మంచు...
నే మొగ వేసాము నీవాడ వేసాము
ఆహిరి విటకారా లారంబింతాం, ఆరం...ఆరం...ఆహిరి...
కల్లు సంద్రాన్కెళ్ళి కల్లంతా తాగేశి
ఆరే సంద్రా లని అరిచి వొత్తాం, అరిచి...అరిచి...ఆరే...
మనలోనే యేమైనా మరికిత మొత్తేను
నావేటు లన్నిట్కి నీవేతిను, నీవే...నీవే...నావేటు...

[నేపథ్యమున మహాతూర్యధ్వనులు.]

గంభీ.—[శ్రవణ మభినయించి] అదె! ప్రభువు వస్తున్నాడు. నువ్వు పో.

కరే.—పోతాను. [అని పొంచకపోయి చేరును.

గంభీ.—దీనియిల్లు బంగారం గానూ, యిదేమో యీవేళ కొంప మునిగేలాగుంది. [అని పోయి తలుపు తీయుంట నభినయించును.

బాణాహ్లాదన రాజ్ఞీ కుంభాండులు ప్రవేశించి
యథోచిత ముపవిష్టు లగుదురు.

యథావిభవము పరివారంబును ప్రవేశించును.

గంభీ.—మామగారికి నమస్కారము.

[అని బాణునికి ప్రణమిల్లును.

బాణు.—కల్యాణము. వత్సా, నీశ్రద్ధకు సంతోషము. కూర్చుండుము. ప్రేయసీ, నీయత్న మేమయినది! ఉష వివాహమున కంగీకరించినదా? ఇపుడు స్వస్థముగానే గదా యున్నది? వివాహము సేయక పెండ్లియీడు వచ్చినపిల్లను ఇంట నుంచుకొనియుండుట యవమానము గదా. పెండ్లిచేత దానికిని మనకును ఎడంబాపు గలుగకుండ ఈగంభీరుని కిచ్చి వీనిని ఇల్లరిక ముంచుకొన నిశ్చయించితిని గదా. ఇంతకన్న దాని కేమిగావలయును! అంగీకరించిన సంతోషవార్త చెప్పుము ప్రేయసీ.

రాణి.—ప్రాణేశ్వరా, ఏమి సేయుదును! ఎంత బోధించినను, ఎంత బతిమాలినను, ససేమిరా యనుచున్నది. నిర్బంధించిన అది ప్రాణము విడుచును, నిశ్చయము.

బాణు.—[కోపావేశముతో] ఆ! ఆ!

గంభీ.—[ఆత్మగతము] ఈలాగైనా నాకు తప్పునుగాక! [ప్రకాశము] త్రిజగతీనాయకా, ఏల నిర్బంధము? ఉష సుఖముండుగాక.

(మదనము)

దూరాననేనిచ్చును గందును గన్నులారన్
నీరేరుహాసన గొనక నెన దూనదేనిన్;

ధారాధరాళిఁ గని సంతస మొందదొక్కొ-
నీ రియ్యకే యనుఁజిమినక్ శితికంఠ ముర్విక్. ౭౦

బాణు.—[క్రోధావేశముతో] అంగీకరింపదేని యింక నుండదు.

(వనమయూరము)

కానను దనూజ యని, కాఱియల నైతుక్,
మాన నిఁక బాసటగను మాధవుఁడె గానీ;
ఈ నిసుగు నాయెదకు నీతి యిడ సాగెక్;
ఏనికకుఁ దొండమున నింగిలము సొచ్చె. ౭౧

ముల్లోకముల జేతను పిల్ల నరకుగొనదఁట! మంత్రీ, కంచుకిని రప్పించి ఉషను తెప్పింపుము.

కుంభా.—ఎవరోయి, అక్కడ? [అని యర్థోక్తిలో నే పరికించి] దేవా, కంచుకియే వచ్చుచున్నాఁడు.

[బాణుఁడు గుప్తముగ నిట్టూర్పులు వడివేయును.

కంచుకి—[ప్రవేశించి యాత్మగతము] అయ్యో! కోటికాల మునకు ఎట్టి పని నాకు సంభవించినది! ఇతరులది తప్పు నాతలకు ముప్పు! నాకలి యీగడియలో నేమి కానున్నదో! నాకలి యేమైన నేమి, ఆ మంగళవిగ్రహము ఉషకా యిట్టి కీడుగలుగుట! అయ్యో! ఇందులకా నే నింతకాలము బ్రదికితిని! హా! దైవమా! హా! దైవమా! వీఁడుగో ప్రభువు.

---

౭౦ ప.—నీరేరుహానన = కమలముఖి. సెనరు = కరుణ. ధారాధర ఆళిక్ = మేఘపంక్తిని. శితికంఠము = నెమలి.

౭౧ ప.—తనూజ=కూఁతురు. కాఱియలక్=బాధలయందు. బాసట= సహాయుండు. నిసుఁగు=శిశువు (ఉష.) ఎదకుక్ = హృదయమునకు. ఈతి = ఈతిబాధవంటి బాధను. ఇంగిలము = ఒక తెగ చేఁప, అది సన్నగా జెల్లివలె నుండును, అది పట్టినయెడల తేలు కుట్టినట్లు విష మెక్కును.

ఎట్లు వాకొందును! హా! ప్రళయకాలరుద్రుఁడుగాఁ గనపడుచున్నాఁడు. దావాగ్నిలో శలభంబువోలె పోయిపడెద. ఈతనికోపము నాతో చల్లారితే ఉమకు అపాయము తప్పును గాక. [సమీపించి ప్రకాశము] జయము జయము జగదీశ్వరునికి! [స్వగతము] ఆచారోక్తి పలికితిని. నోట తడి లేదు. మాట రాదు. [వడవడ వణఁకుచు] జగదీశ్వరా,

బాణు.—ఏమోయి నీ తబ్బిబ్బు? నీముఖము చూడఁగా ఏమో చావువార్త తెచ్చినవానివలె నున్నావు? నిర్భాగ్యుఁడా!

కంచు.—మేము జాగ్రత్తగానే యుంటిమి! ఆమహేశ్వరునిపాదము లాన! ఏలినవారిపాదములాన; అయినను, మఱి, [అని గుటకలు మ్రింగును.

బాణు.—పాపిష్ఠుఁడా, అయినను ఏమిరా? ఏమైనను?

[అని కత్తి దూయును.

కంచు.—అమ్మాయి ఉమ గర్భిణిగా నున్నది! పురుషుఁ డంతఃపురము లోనున్నట్లు తెలియుచున్నది!

బాణు.—ఏమి! ఏమీ! ఉమ గర్భిణి! పురుషుఁ డంతఃపురములో! ద్రోహీ, ఇదా నీమాట! ద్రోహీ, నీవు కాపాడితివఁటరా?

[అని కత్తితో పొడువ నుంకించును. అప్లోదనుఁడు కత్తిని పట్టుకొని తప్పించును. కంచుకి కృతాంజలియై వినయనమ్రుఁడునై యుండును.

గంభీ.—[ఆత్మగతము] ఇందుచేతనే పెళ్లి వొల్లనన్నది! అహాహా!

బాణు.—ఓహోహోహో! నాయింటనా విటకోలాహలము! ఓరీ ద్రోహులారా! [అని భద్రాసనము డిగ్గనుఱుకును. అందఱు లేతురు.

బాణు — (స్రగ్ధర)

ధూళీపాళీకరింతున్ ధుటి మాతెఁ బుడమిన్ ధూర్జటిప్రీతి గాఁగన్,
శైలవ్యూహంబులన్ గొటడిగ దనదనన్ జల్లెదన్ వేనవేల్గాన్,

---

శలభంబు = మిడుత.

నాలోలద్గ్రావజడిన్ ఘట్టనము గొలిపి యబ్జాండప్రచయంబుల్ దెమల్తున్,
వేలంఘాచంగతన్ నిర్విధి యహరిగ నీవిశ్వమున్ బాడొనర్తున్. ౭౨

ఇదె యిప్పుడె దానియంతఃపురము సొచ్చి—

[అని పటపట పండ్లు కొఱుకుచు కోపావేశ మాడుచుండును.

రాణి.—అయ్యో నాపట్టీ !

ఆప్త.—అయ్యో నాసోదరీ మంగళమూర్తీ !

గంభీ.—[ఆత్మగతము] నాతంటా తీరింది. యీగంభరగోళంలో నా యదృష్టం మంచిది !

బాణ.—దానిచెలువునిం బట్టి మెడపట్టి యీతీరున నులిమెదను.

[అని గంభీరవేదిని మెడ నులుమును.

గంభీ.—కో [అని యేడ్చి] అయ్యో! అయ్యో! అమ్మ కొక్కణ్ణి ! అమ్మ కొక్కణ్ణి.

బాణ.—దౌర్భాగ్యదూషితుఁడా, నీయపలక్షణమా నేఁ డిట్లు సంభవించినది ! పాడుముండకొడుకా !

[అనికొట్టును. గంభీరవేది క్రింద పడి దొరలి తప్పించుకొని పోయి పరిజనము వెనుక నణఁగును. కరేణుక బాణకనుండి దొరలి పెద్దద్వారమునం బాఱిపోవును.

---

౭౨ ప.—ఈభూలోకమును ఇటునటు ఆడించుటచేతను కొట్టుటచేతను నుగ్గునూచము చేసి శివునికి ప్రీతి గలిగించెద.—(అయన సంహారము చేయువాఁడు, ఆపని నేనే చేసినచో అయన విశ్రాంతి పొందినవాఁడై ఆసేవకు నన్ను మెచ్చుకొను నని భా.) శైలవ్యూహంబులన్ = కొండల సమూహములను. గ్రావజడి=శిలావర్షము. లోలత్ = చలించుచున్న. అబ్జాండప్రచయంబుల్ = బ్రహ్మాండ సమూహములను. లంఘాచంగతన్ = దాటుటయందలి నేర్పుతో. నిర్విధి=బ్రహ్మలేనిదిగాను. అహరి=విష్ణువులేనిదిగాను. విశ్వమున్=లోకమును.

బాణు.—

క. వానిని గ్రద్దల కేసెద,
దాని మహాంభోధి క్రిందితలమున దాఁతుక్,
వే నాతో రండు సోరం,
గానక్ దద్గేహమునకుఁ, గట్టుఁడు వానిన్. 23

---

స్థలకము II.—మందాకినీ ప్రాసాదము.
ఉషానిరుద్ధులు సంగీతగోష్ఠిగా ప్రవేశింతురు.
[అహ్లాదనాదులు స్తంభములందు లీనులై యుందురు.
బాణుఁడు శిలతలుపులను ఎత్తి అచ్చట తలచూపును.

ఉష.—ఆర్యపుత్త్రా, ప్రేయసిని కాంతుఁడెట్లు చూచుకొనవలయునో దానిని నీదివ్యగానమునం బాడుము.

బాణు.—[ఆత్మగతము, కోపముతో] 'ఆర్యపుత్త్రా!' 'ఆర్యపుత్త్రా!' [ఇంచుక శాంతితో] అయినను వీఁడెవఁడో మహాపురుషుఁడే.

రాణి.—[నిర్వర్ణించి] అహా! ఇట్టియల్లుఁడు దొరకుట మహాభాగ్యము గాదా?

అహ్లా.—ఏమి నాచెల్లెలిపుణ్యము! ఏమి మాపుణ్యము!

అని.—ప్రేయసీ, కాంతంగూర్చి కాంతుఁ డిట్లు నడచుకొనవలయును.

(మధురాక్కర.)

ప్రియసఖునిబోలె, శిష్యగా, గృహదీపకళికఁగాను,
దయ దొలంక వివిధ భోగ దాతృ కల్పలతఁగాను,
అయము గా నవనవర క్తి నర్ధాంగలక్ష్మి నెప్డుఁ
బ్రియుఁ డఖిలజన్మసతిఁ గన్న, వే ఐంద్రభోగ మేలా! 24

---

23 ప.—అంభోధి=సముద్రము. తద్గేహమునకున్=దానియింటికి.

24 ప.—దాతృ=ఇచ్చునట్టి. అయము=శుభము. అర్ధాంగలక్ష్మిన్—భార్యపురుషుని దేహార్ధమని శాస్త్రము.

ఉష.—మహాప్రసాదము.

అని.—మఱి, ప్రియునియెడల ప్రేయసి యెటుండవలయునో నీముద్దు వాక్కుల నావీనులకు విందొనర్పుము.

ఉష.—ఆర్యపుత్త్రా, నా ననుఁబ్రాయిపల్కులను మన్నింపవలయు.

(మధ్యాక్కర.)

కాంతునిం దనమేటిదేవుఁగా గురుంగా దొరంగాఁగ
సంతసంబె మొగానఁ దోఁప సంతానపాదపంబుగను
స్వాంతముఁ జేతలుం దాను సతనికై తనకుఁగాఁ గాక
కాంత రెం డిండ్లకుం గీర్తి కలుగునోజను గొల్వవలయు ౨౫

అని.—అహాహా! ప్రియా, నీమృదువాణి వినవినం దృష్ణ హెచ్చుచున్నది!

రాణి.—[ఆత్మగతము] నాకుఁ గీర్తి తెచ్చితివి నాయనా.

బాణ.—[పైకి దుమికి ఆత్మగతము] వీనిం జూడ నామొదటికోపము మొక్కవోయినది. అయినను అనాసురవృత్తమును సేనొల్లను. [ప్రకాశము] ఓరీ, పట్టుడు వీనిని. [బాణపరివారము అనిరుద్ధుని చుట్టుకొనును.

బాణ.—ఎవఁడవురా నీవు!

అని.—[లేచి] నీయల్లుఁడను మామా. [అని కత్తి దూయును.

బాణ.—ఛీ! చోరా! అల్లుఁడవా మల్లుఁడవా!

[అని అనిరుద్ధుని కత్తితో వేయఁబోవును.

అష్ట.—[ఆకత్తి పట్టుకొని] నాయనా, ఇట్టియల్లుఁడు నీకుసులభుఁడా? మహాపురుషుని సత్కరింపుము. [అని యడ్డపడును.

రాణి.—ఆర్యపుత్త్రా, ఉషను రక్షింపుము.

---

౨౫ ప.—సంతానపాదపంబు=కల్పవృక్షము — సకలము నిచ్చువాఁడు అనుట. స్వాంతము = మనస్సు. ఓజన్ = విధమున.

బాణు.—[రాణిని] ఛీ! దుర్జాతా! [అని, కుమారుని గోడకు విసరి] రారా దొంగా. [అని అనిరుద్ధుని తీరును.

కుంభా.—[ఆత్మగతము] హా! ఈమాటు నారాయణుండు ఈదివ్య మంగళరూపమున నసురనాశార్థ మవతరించినాఁడు. కాన, జగదావ చావు, రాజాజ్ఞ: [అని అనిరుద్ధుని చుట్టవేసికొనును. గంభీరవేదియుం నట్లే చేయును.

ఉష.—ఆర్యపుత్త్రా, నిన్నుఁ గాచుకొమ్ము, మానాయనం గావుము.

అని.—ప్రేయసీ, భయపడకు.

[అని యోయంధము పాఱవైచి, కుంభాండుని త్రోసి, గంభీరవేదిని కడుపుపైఁ దన్నును. ఇరువురును మూల కొకఁడు ఒఱగుదురు.

కుంభా.—[కడుపు పట్టుకొని నొప్పి సూచించుచు, ఆత్మగతము]

క. నీలోత్పలకోమల మిా
బాలునిమే నేదొ యొక్క బ్రహ్మాస్త్రమురా!

గంభీ.—[కడుపు పట్టుకొని యేడ్చుచు]

నీలాద్రి నల్ప మతా దం
భోళికరణి వీనితన్ను మ్రుచ్చిలె నన్నుఁ! 26

జన్మజన్మమునకు నాకు ఉష అక్కఱలేదురా బాబూ!

[బాణుండు నాగపాశముతో అనిరుద్ధునిం గట్టి వేయును. అనిరుద్ధుఁడు నిశ్చేష్టుఁడై పడును.

---

26. క.—ఈబాలుని దేహము నల్లగలువవలె మృదు వయినను వీని దెబ్బమాత్రము బ్రహ్మాస్త్రమువలె అప్రతిహతముగా తగులుచున్నది. పెద్దకల్ల కొండను చిన్నవజ్రాయుధము కూల్చినట్లు చిన్నవాఁడయిన వీని తన్ను నన్ను దొంగిలించినదిగ్గె(నాశముచేసినది).

గంభీ.—ఏమి మహాప్రభువుమహిమ !

కుంభా.—మేఘనాదునిబ్రహ్మాస్త్రమునకు అంజనేయులువోలె ఇతఁడే మోహకారణవిశేషముచే నాగాస్త్రమునకుఁ గట్టుపడినాఁడు. కావున మన లను నొంపవచ్చువాఁడు మఱియొకఁడు కలఁడు.

బాణు.—[కుంభాండుని, గంభీరుని లేపి] ఓరీ నిర్భాగ్యురాలా, వీనిం జెఱకుం గొనిపొండు. వీనికి చండికాద్వీపములో అంధకారప్రాసాదము కారాగృహము. గంభీరా, ప్రకృతము నీవు కావలి.

గంభీ.—[నొస్టికి డొక్క పట్టుకొని] మహాప్రసాదము.

బాణు.—[మంత్రీ, ఈపిల్లను భ్రాంతిద్వీపమున నక్షత్రప్రాసాదము కారాగృహము. [అని నిష్క్రమించును.

[కుంభాండగంభీరాదులు అనిరుద్ధుంగొని నిష్క్రమింతురు.

ఉష.—హా! ఆర్యపుత్త్రా! [అని మూర్ఛిల్లును.

రాణి.—అయ్యో, నాపట్టీ అశ్వసిల్లుము, అశ్వసిల్లుము.

[ఉష అశ్వసిల్లును.

రాణి.—రా అమ్మా, బయలిగాలి ప్రాణ మిచ్చును.

[అని ఉషం దోడ్కొని నిష్క్రమించును.

అప్సో.—అహా! ఏమి యూశ్చర్యము!

ఉ. నా యనుజాత యేమి! కుహనావిధి మ మ్మిటు కన్నొలంగి తా
నీ యసహాయశూరుని గతీశసమానునిఁ గూడు టేమి! యే
మో యిది దేవకైతవముఁ బోలెడు;మాకిట లగ్గొ యెగ్గొ!హా!
నాయన చండ దర్ప పరిణద్ధ రణోద్ధతుఁ. డేమి సేయుదుర్!౨౨

కారాగృహము = చెఱసాల.

౨౨ ఉ.—అనుజాత=చెల్లెలు. కుహనావిధిక్ = కపటోపాయముచేత, గతీశ=మన్మథ. దేవ కైతవము = దేవతల మాయ. లగ్గొ = మేలో. ఎగ్గొ =

క. నళినియు నభోమణియు న
ర్మిలి నొండొరుఁ గూడిమాడి మెయిమెయి నుండన్
ఫెళఫెళ నుఱుముచు మెఱుముచుఁ
బ్రళయఘనాఘనుఁడు వచ్చి ప్రళయం బొసఁగెన్.      2౮

నేను పోయి శివదర్శనము చేసికొని మంగళోపసానము వేఁడుకొనియెదను.

[అని నిష్క్రమించును.]

తురీయాంకము ముగిసినది.

---

కిడో. చండ...తుఁడు = తీవ్ర గర్వముతో కూడుకొన్న యుద్ధమునందు విఱ్ఱవీఁగువాఁడు.

2౮ ప.—నళిని = తామరతీఁగ. నభోమణి=సూర్యుఁడు. కూడిమాడి= కలసిమెలసి. మెయిమెయిన్ = అనుక్రమముగా. ఘనాఘనుఁడు = వర్షించుచున్న మేఘుఁడు. కూడిమాడి = కలసిమెలసి.—సుఖప్రదముగానున్న యసుహాని దద్ధులను కాఁపుఁడు చెఱుపు చేసెనని పద్య భా.

# పంచమాంకము.

---

స్థలము I. భ్రాంతిద్వీపము నక్షత్రప్రాసాదము.

ఉష ప్రవేశించును.

ఉష.—ఎవ్వరును దృష్టిపథమున లేరు. అందఱును కనుమొఱంగి వచ్చితిని. [క్రిందికి తొంగిచూచి] క్రిందిభూమి యగపడుటయే లేదు. చిత్రలేఖకుంగూడ అక్కఱ లేనియీదుఃఖజన్మమును ఇక్కడినుండి పడి సమాప్తి నొందించెద.

క. గౌరి! నీకిదె నాకద
సారిప్రణామంబు, వర మొసంగుము తల్లీ,
వారక ప్రతిజని నా కతఁ
డే రమణుఁడు గాఁగ చిత్రయే సఖి గాఁగన్. ౨౯

[అని దుముకును.

చిత్రలేఖ ఆకాశయానమునఁ బ్రవేశించును.

చిత్ర.—

క. చూడవు పతిఁ, జూడవు సఖిఁ,
జూడవు గర్భస్థమైనసుందరమూర్తిన్;
మోడిగఁ బ్రాణసఖీ, యీ,
పాడువిధిమతంబె సిద్ధపఱిచెద వేమే! ౩౦

[అనుచు మధ్యనిలువులో పట్టుకొని మేడమీఁదికి తెచ్చియుంచి సేదదీర్చుచు]

ఆశ్వసిల్లుము సఖీ, ఆశ్వసిల్లుము.

---

౨౯ ప.—వారక=తప్పక. ప్రతి జనిన్ = ఎల్ల జన్మములందును.

౩౦ ప.—మోడిగన్=పంతముగా. విధి=నియతియొక్క.

ఆశ్వసిల్లుము=ఊఱడిల్లుము. హర్మ్య పృష్ఠము=మేడపైతలము.

ఉష.—[కన్ను దెఱచి, ఆత్మగతము] నే నెచట నున్నాను. ఉషను గదా. మందభాగ్యను గదా. మృతికై గదా పడితిని. ఇ దేమి జన్మాంతరమా? ఇది యేలోకము? [చిత్రరేఖం జూచి] ఈదేవత యెవరు? చిత్రరేఖగా నున్నది! [కలయంగని] అదే యీహర్మ్యపృష్ఠము. ఈమె నన్నుఁ గాచినది. [ప్రకాశము] చిత్రరేఖా,

చిత్ర.—ఉషా, ఏమి యిట్లు చేసితివి?

ఉష.—న న్నేల కాచితివి?

చిత్ర.—ఓసి గోలా,

క. పతి యేమి తప్పు చేసెనె?
సుతుఁ డీగర్భస్థుఁ డేమి సొం టొనరించెన్?
వెత నేమి నేను గుడిపితి?
మృతి నొక్కటె మాఱు మువురకిడుటకు జెలియా! ౧౧

ఉష.—నే నేల బ్రదుకవలయును సఖీ?

చిత్ర.—ఏల యట్లు పల్కెదవు?

ఉష.—సఖీ,

సీ. ఒడిలోన నేను లేకోలగం బుండని । తండ్రికి నేఁ బగదాన నైతి,
నన్నుఁ గైసేయించి కన్నదే దినమైన । తల్లికి నే విషవల్లి నైతి,
ప్రాణంబుఁ బ్రాణంబు పగిది న న్నోమెడు । నన్నకు నేఁ దలవంపువ్యాధి నైతి,
ననుఁ గోరి తనప్రాణమునకుఁ దెగించిన । దయితుని కే బంధదాత్రి నైతి,
తే. ప్రాణనాథుని నేఁ గొల్చు బంది నైతి,
తప్పు లేక కుశీలవతాళ నైతి,
డెప్పరము మాని సకి నీవ చెప్పుమమ్మ
మాన మేఁడినవెలఁదికి బ్రాణ మేల? [అని యేడ్చును.

---

టీ క.—ఓలగంబు ఉండని = కొలువు తీరని. కైసేయించి = అలంకరింపించి. వల్లికి = తీఁగను. పగిదిన్ = వలె. ఓమెడు = రక్షించెడు. దయితునికిన్ —

చిత్ర.—[కన్నీళ్లు తుడుచుచు] ఏడువకు చెలీ, ఏడువకు ; పతిమతల్లికి నీ కేటి కొఱంత! సాజతనము కొఱవడియుండిన మీ కీయిడుములు వచ్చి యుండవు. [ఉష రొమ్ము మోఁది నిట్టూర్పు పుచ్చును.

చిత్ర.—[ఉషాహృదయముం దాఁకి] సఖీ, నీగుండియ లింకను అదరు చున్నవి. సమాశ్వసిల్లుము, సమాశ్వసిల్లుము.

ఉష.—ఈమందభాగ్యకై నీపడిన క్లేశమును చెప్పుము. నీ సుచరిత్రము నా దౌర్భాగ్యము నడంచి సమాధి నొసంగును.

చిత్ర.—నాఁడు నీమీఁద మీనాయన యేమి యుద్యమించునో యెఱుఁగఁగోరి తత్పథలో నదృశ్యకరణి నై యుంటిని. ప్రకృత మెఱింగితిని. వారు మీకడకురాకమున్నె మి మ్మిరువురను ద్వారకం జేర్ప దలంపుగొని మీ కడకు మెఱుపువడిని వచ్చుచుంటిని.

ఉష.—మఱి యేల యట్లు కొనిపోవైతివి సఖీ ?

చిత్ర.—దారిలో నారదులవారు వారించిరి.

ఉష.—హా! ఎంతటి పాపాత్మురాలను! ఆ ప్రాణేశ కట్టుబందిక సంగతము అనను కంపనీయనైతిని!

ఆ. దేవమానిని యహహా! దీనమందారుండు,
జాలి వెట్టి నాకు జాలి లేక ;
నిఖిలలోకులకును నీరిచ్చు మేఘుండు,
పిడుగు వైచు భాగ్య వియుతు మీఁద. ౮౩

---

=ప్రాణనాథునికి. బంధదాత్రిక=చెఱ గలిగించినదానను. బందిక = ఖైదిని. కుటిలపతాకక=చెడునడతకు జెండాను. ఏదిన=పోయిన.

అదృశ్యకరణి=ఒరుల కగపడకుండుటకు సాధనమైన విద్య.

౮౩ ప.—దీనమందారుండు = దీనులపాలిటి కల్పవృక్షము. జాలి = దుఃఖమును. జాలి=కనికరము. వియుతుక్=హీనుని.

చెడ్డకాలమున మంచివారికింగూడ ద్వేషము కలుగును.

చిత్ర.—నీశ్రేయోవిశేషమునకై వా రట్లు చేసిరి.

ఉష.—నాకును శ్రేయమా?

చిత్ర.—నీకడుపులోని మహాపురుషుని శిశురూపలాలితుని నీప్రాణనాథునికి కానుక యిచ్చుభాగ్యము ఎవరిది?

ఉష.—అంతభాగ్యమా?

చిత్ర.—అంతకన్న వేయిమడుంగులు. మఱి యిట్టి దారుణారంభములు సేయ నని నాకు మాట యిమ్ము.

ఉష.—నీవు దివ్యప్రభావవు. నేఁడు నా ప్రాణేశ్వరుని నాకు చూపుదువేని, మాట యిచ్చెద. చూపనిచో, నాబుద్ధి నాది గాదు.

చిత్ర.—రారమ్ము. నాఁ డతనిని నీకుం దెచ్చితిని. నేఁడు నిన్నతనికిఁ గొనిపోవచ్చితిని. [అని ఆకాశయానమున ఉషం గొనిపోవును.

---

స్థలము II.—ఆకాశము.

ఉష.—సఖీ, ఈయాకాశగమనము నాకుఁ గడువింతగా నున్నది. సఖీ, నాతప్పులు మన్నింపుము. నిన్ను బ్రహ్మ నాకై చేసినాఁడు ప్రాణసఖీ, నా ప్రాణేశ్వరులు ఎట్లు ఆరగింతురో, ఎట్లు నిద్రింతురో, ఎట్లెట్లు కాలము పుత్తురో చెప్పఁగలవా?

చిత్ర.—తెలియదా?

ఆ. నిన్నుఁ బాసినట్టివన్నె కానికి నెట్లు
కన్నుఁగవకు నిదుర గల్గునమ్మ?
ఆరగించు టొక్కయభినయం బవుఁ జూమీ;
క్షణము యుగ మటంచుఁ గనఁగ లేవొ? ౨౨

---

గంతవ్య = పోవలసిన. ప్రాసాద పృష్ఠమునఁ = మేడపై తలమున.
దీప్తి = కాంతి.

ఉష.—[నిశ్వసించి] ఎంతదారుణంబిక్తైను చెలీ!

---

స్థలము III.—చండికాద్వీపము, అంధకార ప్రాసాదపృష్ఠము.

చిత్ర.—గంతవ్యదేశమునకు వచ్చితిమి. ఆహా! ఏమిమంచిసమయము! చూడు. ఇతఁడె నీ ప్రాణవల్లభుఁడు ప్రాసాదపృష్ఠమునం బరుండి యున్నాఁడు.

ఉష.—ఔనౌను, దీప్తి చేతనేగాని ఆకృతి చేఁ బరిచయముకాకున్నాఁడు సఖీ.

చిత్ర.—నీకృత్య మెంతదారుణమో యితనిభాషితముల నాలకింపఁగదవు లే. ఈశరుళిఖరమందు ఈపట్టంపుటాకుబోఁటులో నిలిచి పరికింతము రమ్ము.

[అట్లుచేయుందురు.

అనిరుద్ధుఁడు యథానిర్దిష్టుఁడు ప్రవేశించును.

అని.—[దిగ్గనలేచి కూర్చుండి ఊర్ధ్వము సూచి] ఆహా! నాశోకసాధనముదొరకినది!

ఆ. కప్పుమాల్మి కాఁడ ఖండేందుతరి నెక్కి  
వెల్గుఁదెడ్లు వయిచి విన్ను వాఁక  
నురవణింతు వహావా! యుదిరి కే విచ్చెదఁ,  
జెలియ యుండు రేవుఁ జేర్పు నన్ను. రాశి

హా! లక్ష్యపెట్టఁడు గదా నిశాచరుఁడు! ఓయి ద్విజరాజా,

---

రాశి క.—చంద్రునిలోని నల్లనిభాగ మనెడి రాముచాలిమీ, చంద్రరేఖ యనెడిపడవనెక్కి కిరణము లనెడి తెడ్లు వైచి ఆకాశ మనెడి యేటిలో వడివడిగా జరుగుచున్నావు; ఆశ్చర్యముగా నున్నది! నీకు బంగారము కేవుగా నిచ్చెదను! నన్ను నీ పడవలో ఎక్కించుకొని నాప్రాణేశ్వరి యుండు రేవునకుం గొనిపొమ్ము.

నిశాచరుఁడు=చంద్రుడు—రాక్షసుఁడు క్రూరుఁడు నగియు భా.

ఆ. రెండు కరములందు రెండు చేతులు వట్టి
యుపసు వీచి నాకు నొసఁగవయ్య;
అట్లు సేయవేని యట్ల నన్నె యెత్తి
యుప కొసంగి సుకృత మొందవయ్య. ౮౯

ఏమియుం జేయవా? కాలకూటసహోదరుఁడవుగదా.

ఉప.—సన్నిహితను నన్నెటుంగక యెంత తపించుచున్నాఁడే ఆర్యపుత్త్రుఁడు. చంద్రునిచేఁ జక్రవాకముల కగుగతి దైవముచేత మా కయినది? [ఊటుము!

అని.—[ఊర్ధ్వ మరసి] ఓయి మేఘుఁడా, నీవుపకరించెద ననుదువా! అట్లేని?

ఆ. పవపదా యటంచుఁ బవి మోగిఁగ భీరువు
లులికి తావుదప్పు టుర్వి నిజము,
అట్టె యుఱుమి నీవు ననభూత్మ యురలింపు
ముపసు నాదు పేరు టురమునకును. [ఊటుము.

అని.—ఏమి? ఉపసు గుత్తెటుఁగ నందువా?

క. ఏయువిద మేనిమోగిలను
నీయబల తటిన్మతల్లి నిగుటు గవిసి య
ట్లే యున్న దావ హాత తరు
వో యనఁ జూపట్టు, నదియొ యుప సుమ్ము సఖా. ౯౧

---

౮౯ ప.—కరములందు=నీ చేతులందు. వీచి=విసరి. సుకృతము=పుణ్యము. సన్నిహితను=చెంతనున్న దానిని.

౯౦ ప.—పవి = ఇంద్రుని వజ్రాయుధము - పిడుగనుట. భీరువులు= పిఱికివారు- స్త్రీలు. ఉర్విన్ = భూమిలో. ఉరలింపుము=దొరలింపుము.

౯౧ ప.—ఏదే నొకచెట్టు దావాగ్నికి మండిపోయి నిగుటు గప్పి కేలకుం

ఉష.—చెలీ, ఆర్యపుత్త్రుని యీపరిదేవనమును నే నెట్లు సహింతును!

అని.—నీయుబిదను డిందుపఱిచినందులకు నీవు అలిగెదవా? అయ్యో జీమూతా, మఱి యేమియుం జేయఁజాని,

ఆ. ధరణి నెల్లవారు దాంత వందుపుప నిన్ను,
నొక్కకోర్కి నాకు నొసఁగవయ్య,
పుడమి కెల్ల నమృతపూరంబు వర్షించి,
పిడుగు నొకటి నాకు విసరవయ్య. ౭౯

ఉష.—అయ్యో చెలీ, ఈవీను లేమి వినుచున్నవి! [ఊఱుము.

చిత్ర.—ఊఱుము పెటపెటకు ఱలిసపడిన చిలుకగా పోయి యీ ముత్యాలహారమును నీమనోవల్లభుని కిచ్చి తత్క్షణమే రమ్ము. ఇదె నిన్ను మార్చితిని.

[ఉష చిలుక యైనది. పెటపెట ఊఱుము హారముతో చిలుక అనిరుద్ధునిమీఁద వ్రాలును.

అని.—అహా! వారిదా, మహోపకారీ, ఇదె నీపిడుగును గ్రహించెద. జన్మజన్మమునకును కృతజ్ఞుఁడను. [అని చిలుకను సహారము కొదంగొని, సుఖస్పర్శ మభినయించి, పరికించి] ఏమి యిది పిడుగు గాదు, సహారము శుకరాజము. ఆహా! ఏమి దైవవంచన! అహా! ఇదేమి వింత!

తే. పసరుఁబట్టుఱవికజగ్గు పరిధవిల్ల
నరిదితాఁకుడుచేత మోహమున ముంచు
స్తనయుగముతో డిభామవక్షంబుఁ బోలి
చిత్తమున కెక్కు నీముద్దుఁజిల్క యక్కు. ౮౦

---

గూలక అట్లే నిలిచియున్న నెట్లు కళాహీనముగా నుండునో, అట్లు నీభార్యయగు మెఱపుఁదీఁగ నాప్రియతమ యగు నుష మోిల శాంతిహీనమై వెలవెలఁబోవుచుందును, అగుర్తుఁబట్టి ఉషను తెలిసికొవయ్యా ఓమిత్త్రుఁడా.

౮౦ ప.—అక్కు=వక్షము.

దీనితో హారమేమి? ఇది యెవరిదో బుద్ధిమంతులది పంజరపుఁ జిలుక.
తప్పించుకొని వచ్చి తరువాత మలవాటుకేమి ఊఱుమున తులికి యిటం బడి
నది, దీనిం జేర్చెద. [అనియెత్తి యక్కున నిడికొని ముద్దుగొని యుపలా
లించుచు] ఆహాహా!

ఉ. మాటలు నేర్పి శిష్యువలె, మాటికిఁ బండ్లిడి బిడ్డకైవడిన్,
మేటికుచాద్రులన్ నిలిపి మెచ్చుచు ముద్దిడి కాంతునింబలెన్;
గాటపుఁగూర్మిఁ జెల్లెలినిగాఁ జెలువల్ చెయివీడకున్నరున్,
రాటె యొసంగెనో చిలుకరాణిరొ నీకును బంధనక్రియల్?

ఆహా! ఇట్టి హారము నే మన్నామాంకితము ప్రియావక్షోరుహముల సేవలం
కరణ ముంచితిని [మెఱుము.] ఈమెఱుమునం దెలిసినది, అదే యీహారము
మేఘధవమౌక్తికముల రచించినది, విద్యాధర చక్రవర్తి మాతాతకు కానుక
యిడినది. [మెఱుము.] ఇవి యేమి యీయక్షరములు. [చదువుట నభినయించి]
'ఉష'! ఆహాహా!

[అని ఆనందజడుఁడై మూర్ఛిల్లును. చిలుక కలకలం గూయుచు
ఱెక్కల నతనివీచును. అనిరుద్ధుఁడు తేరును. చిలుక అనిరుద్ధుని
కొరఁకి యెగిరిపోయి చిత్రకడ నుపాకృతిం దాల్చి నిలుచును.

అని.—[చిలుక పోయినవలను చూచుచు] ఏమి యీమాయ! ప్రియ
దీనింబంపినదా నాప్రాణములు నిలుపుటకు? నాయుపలాలనంబుల నింకనింకఁ
గోరినదై వడి నిది నాకు వశంవదయై యుండినది. నాప్రియయే యిది. సందే
హము లేదు. అయ్యో! వచ్చియుఁ ప్రియ యిట్లు క్షణదృష్టనష్ట గావలయు
నా! హా! చిలుక యయ్యును పలుకదాయెఁగదా! హా ప్రేయసీ!

---

బుద్ధిమంతులది=సిరిగలవారిది.

౨౧ ప.—మేటికుచాద్రులన్ = గొప్పచనుఁగొండలమీద. రాటె =
ఆయాసముసే.

ఉష.—సఖి, ఒక్కమాటకేని సెలవీయ వయితివే!

చిత్ర.—అనియమితేంద్రియులకు ఆసన్న శుభములును దూరము లగును.

అని.—ఇట్లనుగృహీతునికి మరణాశంస యేల! పెండియుం ఇట్టి యీ సమాగమమేని దైవ మొసంగదా! ఈమాట వచ్చినప్పుడు,

క. ఒక్కమ్మడి ముద్దులబడిఁ
జిక్కువఱిచి మఱపి పల్కఁజేసెదఁ జిల్కన్;
అక్కజపున్బిగికౌఁగిట,
నుక్కిరిబిక్కిరిగ నొక్కయుషఁ గావింతున్. ౯౨

చిత్ర.—సఖి, వినుచున్నావా?

ఉష.—[ఆనందబాష్పములతో] ఇంక దారుణారంభములు సేయును.

అని.—ఇపుడె పిడుగుం గోరితిని, ఇపుడె చిరాయుష్యంబుం గోరుచున్నాను. ఏమివింత ప్రపంచ మిది? స్వప్నమా! ఇంద్రజాలమా! [ఊఱుము.] మేఘుఁడేవా, కాదు వాస్తవమనుచున్నావా? నీవు ప్రాణులయాంతర మెఱుఁగుదువు గదా. [ఊఱుము.]

పురుషుఁడు.—[ప్రవేశించి] మహాప్రభూ, ప్రబలవర్షము వచ్చుచున్నది. దేవరవారు లోపల శయన మంగీకరింపఁదగును.

అని.—[ఆత్మగతము] ఆ! ఈచోటు విడువఁ జాల. కానిమ్ము, పెండియుం వచ్చెదంగాక.

[అని లేచి ఆచెట్టును నిర్వర్ణించును. ఉసిరికచిగుళులు రాలును.

అని.—పెండియుం ప్రియాసమాగమ మగునంతఁక ఈహారము నాకు జీవగఱ్ఱ. ఓహారమా,

---

౯౨ ప.—ఒక్కమ్మడిన్ = ఒక్కమాఱుగా. ముద్దులబడిన్ = జడివాన కొట్టినట్లు ఎడ తెఱపి లేకుండ ముద్దులుపెట్టుకొని. అక్కజపు = ఆశ్చర్యకర మయిన.

తే. నాయెదను మున్ను నీ విట్టినయ మెఱుఁగవు,
మెలఁత చనుగట్లతోఁ గొంత మెలఁగినంత
విరహితుని కిట్లు సంజీవకరణి వైతి;
వున్నతులతోడిసంగడి వన్నె యిడదె? ౯3

అని నిష్క్రమించును.

ఉష.—హా! కేశాంతదారుణహృదయను!

చిత్ర.—కెచ్చెలీ, చూడు నీదయితుని యుపచారములు.

ఉష.—ఎంతకాల మార్యపుత్త్రునికి ఈపరోక్షచారక్లేశము?

చిత్ర.—కాలకు ఈతనిపై తలఁపు గలుగువఱకు; నీకావునకుం బోయి యోగా యోగాకున్నశరణ్యు నుపాసింపుము.

ఉష.—నీయాజ్ఞ.

చిత్ర.—మఱి పోదము పద.

ఉష.—ఆర్యపుత్త్రుని వదలిరా నాకాళ్లాడకున్నవి.

చిత్ర.—మనలను వెదకకముందే పోయి చేరవలయును.

ఉష.—అట నన్ను విడనాడవుగదా?

చిత్ర.—ఆమాట నీనాథుని నీవు గలయుందాఁక కేగదా?

ఉష.—అది గల్గునా?

చిత్ర.—తప్పక, త్వరలో. కడసితిమి. మన కిపుడు శుభ యోగనిధి. ఈకార్యోయిభులకుం దొలఁగి పైమార్గమునం బోవుదము. రా రమ్ము. ఆర్త త్రాణపరాయణు శ్రీకృష్ణుం బాడుచుం బోదము.

ఉష.—నీకిష్టను.

ఇరువురు.—[యోగాన మభినయించుచు]

---

౯3 క.—నయము = నేర్పు. ఉన్నతులతోడి = గొప్పవారితో నైన (తుంగము లయిన వానితో నని సూచకము). సంగడి = సహవాసము.

(తెరవాల)

కావవో పాంచాలిఁ గరుణాసముద్ర ?
కావవో మునిరాజుకాంత నహల్యఁ ?
గావవో కపిరాజుఁ ? గావవో కరిని ?
గావవో ప్రణతు లంకాపతియనుజుఁ ?
గావవో ప్రహ్లాదుఁ ? గావవో ధ్రువునిఁ ?
గావవో కుబ్జను ? గావవో పసులఁ ?
గావవేల త్వదేకగతుల నీమమ్ముఁ ?
గావు కావుము రమాకాంతాకళత్ర. ౯౪

[అని విన్నవింతురు.

పంచమాంకము ముగిసినది.

---

పాంచాలిన్ = ద్రౌపదిని. మునిరాజు = గౌతములవారి. కపిరాజున్ = సుగ్రీవుని. కరిన్ = గజేంద్రుని. లంకాపతియనుజున్ = విభీషణుని. త్వదేకగతులన్ = నీ వొక్కఁడవే గతిగాఁ గలవారిని (నిన్నే నమ్మికొనియున్నవారిని). రమాకాంతాకళత్రా = లక్ష్మీరమణి భార్యగాఁ గలవాఁడా.

# ప్రవేశకము.

స్థలకము:—ద్వారక, శ్రీకృష్ణప్రాసాదోద్యానము.

బంభరికాకీరవాణులు ప్రవేశింతురు.

బంభ.—[ఊర్ధ్వము చూచి] వోశేవోశే, కీరవాణీ. చూడు చూడు ఆజోతిని. [ఇరువురును ఊర్ధ్వము పరికింతురు.

బంభ.—ఏమిటే ఆజోతి? నగర్లోనుంచి వుత్తరంగా వెళ్లి మాయమైంది!

కీర.—యిందాక యిది నగర్లోకి వెళ్లింది. మఱి యిదేమిటో తెలవలేదు. అల్లదుగో నారాయణయ్య నగరికాణ్ణుంచే యేమో గొణుక్కొంటూ వొస్తున్నాడు. అయన్నడుగుదాం:

విదూషకుఁడు యథానిర్దిష్టుఁడు ప్రవేశించును.

విదూ.—[తనలో తాను నవ్వుకొనుచు] అప్పుడు నేను సభామందిరంలో తగిలించిన పత్రం యిప్పుడు పనికొచ్చింది. అహాహా!

కీర.—యేమిటయ్యో నారాయణయ్యా, అంతా నీలో నువ్వే! పెట్టిందా అయ్యవారా?

విదూ.—సంతోషం సంతోషం. ఈరోజు 'ఆసంగ మానంద మాయనే.'

బంభ.—ఏమి సంతోషమయ్యా, మాక్కొంచం చెప్పవయ్యా, మేమూ కొంచం నవ్వుతాం.

విదూ.—హే హే హే హే [అని నవ్వి] మీతో ఎందుకూ చెప్పడం?

బంభ.—అయితే దాచుకోవయ్యా.

కీర.—వేళాకోళం చెయ్యక చెప్పవయ్యా, అవెల్తు లేమిటో రెండు తూర్లు అవుపడ్డవి.

విదూ.—నారదబ్బ మహాముని.

[అని గడ్డము దువ్వుచు టింగ్టింగని వీణవాయించుట ననుకరించును.

ఇరువురు.—[ఆశ్చర్యపడుచు, నవ్వి] కాల్లోవా నిశ్చయము బావనయ్యాక.

కీర.—అనిరుద్ధమహారాజుసంగతి యేమైనా తెలిసిందా నాడాయ నయ్యా?

విదూ.—వెన్నెట్లో గట్టు. అనిరుద్ధమహారాజా బాణాసురుడి పట్టణానికి అ జడ్లో ఒకద్వీపరంగా, దాని పేరు మరచిపోయినా, బందిఖానాలో వున్నాడట.

[ఇరువురు ఆశ్చర్యపడుచు వినుదురు.

విదూ.—నేను సభలో పలికినట్టి పత్రం బాణాసురుడి కూతురట, వృష గారట. మరేమునికి తెలిసిందిగాగుగాని యీముని యిక్కడా అక్కడా కూడా తంటాలోడు గనక యీనారదబ్రహ్మకు తెలిసింది, ఆమెనికూడా తండ్రి ఒక ద్వీపాంతరంలో ఖైదుచేశాడట, కృష్ణమహారాజు దుర్మార్గులయ్యగారూ మనమన్లో మనవురాల్ని తీసుకొని రావటంకోసం యిప్పుడే గరుడయ్యనెక్కి బాణాసురుడిమీదికి ప్రయాణం. సాయంత్రంలోపల అనిరుద్ధమహారాజుని ఆయనభార్యని చూస్తాం. రేపే గృహప్రవేశం. అప్పుడే నగరాలంకారానికి కూడా ఆజ్ఞ అయింది; రేపు మేమంతా ప్రస్థానపళ్లాలు కొట్టడం, మీ రంతా యెంగిలాకులెత్తడం. "ఆనంద మానంద మాయెనే!"

[అని చంకలు గుద్దుకొనును.

కీర.—అమ్మయ్యా! యెంతపుణ్యమే! [అని మందరికను కౌగిలించును.

విదూ.—లంజకూతురా, నేను శుభవార్త చెపితే నువ్వు దాన్ని కౌగిలించుకొంటావేమీ? [అని కీరవాణిమీదికి ఎగురును.

కీర.—జంజ పట్టుకొని లాగే, చెడిబదికినబాపడు ముకుదాడు లాగిన యెద్దులాగ లొంగుతాడు.

విదూ.—లంజకూతుళ్లారా, నే నేమీ లాగలేనా, నే నేమీ లాగలేనా?

[అని ఒకతెను మార్చి ఒకతెను తటుకును.

కీర.—పోలే ఆపాదుబాపడికాణ్ణించి యెల్లే!

[అని యిరువురు పలాయిత మగుదురు.

విదూ.—ఆబాణుడు వాళ్లనిద్దర్ని తలా వొక కోటలో పెడితే, నేను మిమ్మల్నిద్దర్ని తలా వొక తోటలో పెట్టలేనా? లంజలారా!

[అని వెంటఁబడును. అందఱును నిష్క్రమింతురు.

ప్రవేశకము ముగిసినది.

---

# షష్ఠాంకము.

---

స్థలము:—శోణపురి, బాణసభామంటపము.

బాణాష్టాదనకుంభాండగరభీరవేదులు

ఉపవిష్టులై ప్రవేశింతురు.

బాణు.—మంత్రిసత్తమా, కన్యాంతఃపురద్రోహి యెవఁడో తెలియం గొననేరవుగదా.

కుంభా.—దేవా, ఇతఁడు అసురుఁడుం గాఁడు, అమరుఁడుం గాఁడు. ఇతఁ డెవరో మహాప్రభావుఁడు మర్త్యుఁడే గావలయును.

బాణు.—[పండ్లు కొఱుకుచు] మహాప్రభావుఁడేమోయి! నీ కేమని బట్టుమాన్య మిచ్చినాఁడా? నిన్ను త్రోసిన త్రోపునకే మహాప్రభావుఁడా? ఆమాట వెండియుం నాచెవిని పడియేని వానిని మాని వానిదండన నీకు విధించెద. నీబోఁటిపందలకు అందఱును మహాప్రభావులే.

కుంభా.—అపరాధిని, మన్నింపవలయును.

బాణు.—మఱి మర్త్యుఁడేని మనరాక్షసులచే భక్షింపింతమా?

అష్టా.—మీనరఖాదనులకు సైతము అట్టిసుకుమారసుందరమూర్తిని గోట మీటనేనియు మనసు వచ్చునా!

బాణు.—వేశ్యాభ్రాతవుగా నీచెల్లెలికి తగిన సరసుఁ డని తెచ్చితివా!

అష్టా.—అప్పు డతఁడు నాచెల్లెలివలపుమంత్రమునకుం గట్టువడఁడేని తమనాగపాశమునకుఁ గట్టువడలేఁడని తలంపుఁడు.

బాణు.—కాదురా, మూర్ఖా, నీమీఁది శకారపుదాక్షిణ్యమునకుఁ గట్టువడినాఁడురా.

---

అమరుఁడు=దేవత. మర్త్యుఁడు=మనుష్యుఁడు. నరఖాదనులకు=మనుష్యభోజనులకు. శకారుఁ డనఁగా రాజు ఉంచుకొన్నదాని సహోదరుఁడు.

గంభీ.—[ఏడ్పుమొగముతో డొక్క చూపుచు] అప్పుడు వాఁడు తన్నినతన్ను నా కేఁక నీజన్మములో మఱచునది గాదు.

బాణు.—ఛీ! నిర్భాగ్యుఁడా! పందమొగము చూపుదువా నాకు! [అని కత్తియెత్తి] పో నాప్రోల నుండకు.

[అని కొట్టఁబోవును. గంభీరవేది ఏడుపు మొగముతో తలఁగి దూరమునఁ గూర్చుండును.

బాణు.—మఱి, చండికి వానిని బలివేయవలసినది.

అష్ట.—అసురకులక్షయకారికృత్య మిది. మఱి, మీకు శక్యము గానేరదు.

బాణు.—ఎక్కడ నేర్చితివిరా యీనీతులు; మూర్ఖా!

[అని కత్తి దూయును. కుంభాండుఁడు కత్తి పట్టి ఆఁపును.

[నేపథ్యమున మహాకలకలము.]

[ప్రచండవాతము.]

పతాకాధికృతుఁడు.—[సంభ్రాంతుఁడై ప్రవేశించి] జయము జయము ఏలినవారికి. పతాకాధికృతుఁడను. లోకాలోకేశ్వరా, ధ్వజము విఱిగిపోయినది! ఉత్పాతవాతము కొట్టినది! చెట్లన్నియు విఱిగి వీథుల కడ్డముగా పడినవి! మేడలు కూలినవి! అగ్నిప్రాకారము అఱిపోయెం, రోదసీకుహరమెల్ల పొగనిండినది! ఎఱ్ఱధూళి లేచి పట్టణ మంతయుం దూరమునకు మండుచున్నట్లగపడుచున్నది! ఊపిరి తిరుగదు! ధూళిచీఁకటిచేతను పొగచీఁకటిచేతను ఎవనియొడలు వానికి కగపడుట లేదు! ఊరంతయుం ఇక్కడిదక్కడ అక్కడిదిక్కడ! గుర్తు పోయినది. ఇందులో మఱిగాడ్పు! నేను సంభ్రాంతుఁడనై ధ్వజముం గౌఁగిలించుకొంటిని. అది పటాలున అక్కడ విఱిగి యిక్కడ సింహద్వారమునఁ బడినది. నేనును దానితో నిట పడి చావు తప్పి లోనికి తూలితిని. అటుపైన యేలినవారిచిత్తము.

---

పతాక=ధ్వజ. రోదసీకుహరము=భూమ్యాకాశమధ్యప్రదేశము.

[అందఱును సంభ్రాంతు లగుదురు.

కుంభా.—[ఆత్మగతము] అయ్యో! అపశకునము!

బాణు.—[స్మరణ నభినయించి] అహో! భాగ్యము! ఈదినము నాబాహువు కండూతి వాయును. మంత్రివరా, పోయి క్షణములో యుద్ధసన్నాహ మొనర్పుము. ముందుగా నింద్రాదులను బంది సేయుము. ఓరీ టెక్కెముగా, నీవని చూచుకొమ్ము.

పత్రా.—[ఆత్మగతము] టెక్కెము విఱిగినది. ఇఁక నాపని యే మున్నది చూచుకొనుటకు!

కుంభా.—<br>పత్రా.— } దేవరయాజ్ఞ. [అని నిష్క్రమింతురు.

బాణు.—[స్వగతము] ఎవరు నిర్మించియుందు రీయుత్పాతమును?

[నేపథ్యమున]

(స్రగ్ధర)

చక్షుర్యుగ్మంబు స్పృశ్యత్క్షణరుచి శుచిభాస్వద్ద్వయీబుద్ధిఁ గొల్పన్,
పక్షద్వంద్వంబు సాంధ్యప్రథమచరమదిగ్భాగవిభ్రాంతి సేయన్,
రూక్షత్రోటీపుటద్వారపరుషమణిసంరూఢ తేంద్రాయుధర్ధిం
బక్షీంద్రుం డద్దిరా యభ్రమున గళగుహావ్యాప్తవిశ్వుండు పొల్చున్.

అన్న.—గరుడపక్షవాతము నాయనా ద్వారకనుండి తరలినయాత్రాసతను మయూరధ్వజముం గూల్చినది.

---

నాగే ప.—రెండుకన్నులును నర్తించుచున్న మెఱుపుఁదీఁగలతోఁ గూడు కొన్న యుద్ధము వేసవిసూర్యులనెడి భ్రమను బుట్టించుచుండఁగా, రెండు రెక్కలును సంధ్యాకాలములయందలి తూర్పుపడమర లనెడిభ్రమను కలి గించు చుండఁగా, కఠోరము లయినగోళ్లను ముక్కు ననెడి వజ్రనిర్మితేంద్రా యుధముల సమృద్ధితో, గరుత్మంతుఁడు ఆపాలోకమంతయుం ఇముడునంతటి గుహవంటి నోరు దెఱచుకొని ఆకాశమున వచ్చుచున్నాఁడు.

బాణు.—కానీ; గరుడునికి పక్షవాత మొసంగెద.

[నేపథ్యమున ప్రచండశంఖధ్వని.]

బాణు.—ఛీ! ఏమి యీపాడుధ్వని!

[గంభీరవేది యులికి వెదకిలంబడి తన్నుకొనును.

[నేపథ్యమున]

(పంచచామరము)

నభంబు వ్రీల, మేరురోమహాణంబు లుర్ల, నాగలో
కభూము లట్టె వ్రయ్య, సప్తసంధు లింకఁ, గుక్షిలో
గుభి ల్గుభి ల్గుభి ల్లటంచు గొట్టుపిడ్గుగొల్పుగా
భభాం ధధా మటంచు మ్రోఁగుఁ బాంచజన్య మద్దిరా. ౯౬

బాణు.—ఈ నిర్భాగ్యుఁడు కుంభాండుఁడు సేయుచున్న యుద్ధ సన్నాహము ఈ బట్టుపొగడికరయే గావలయు!

[గంభీరవేది ఆవర్ణనకు మఱియు నులికి తన్నుకొనును.

బాణు.—[వీక్షించి] వీని కేమి రోగము?

అష్ట.—పాంచజన్యజ్వరము. వీఁడే గదా నాయనా తమరు కోరుకొన్న యల్లుఁడు!

బాణు.—ముందీపాపిష్ఠుని పరిమార్చెద.

[అని లేవ నుంకించును. గంభీరవేది పరువున నిష్క్రమించును.

గోపురనాయకుఁడు.—[సంభ్రాంతుఁడై ప్రవేశించి] జయము జయము ఏలిన వారికి. లోకనాయకా, గోపురనాయకుఁడను. గరుడారూఢుఁడు సభార్యుఁడు కృష్ణుఁడు వచ్చియున్నాఁడు, ద్వారకావాసి.

బాణు.—[ఆలోచించి] అస్మత్కులైకవిద్వేషి యాదవపటువు మా నగర ప్రాకారములను భేదించి మాపాదములు గొలువ వచ్చినాఁడా?

---

పక్షవాతము = ఱెక్కలగాలి (ఱెక్కలకు వాత వ్యాధి.)

కో.పు.—మహాప్రభూ, ఆకాశమునుండియే యిట్లు నాతోఁ బలికి నాఁడు :—

బాణు.—ఏమని ?

కో.పు.—"మామనుమని ఆతనిభార్యను చెఱనుంచినాఁడట— [అని యర్ధోక్తిలో] లోకేశ్వరా, ఆయనసమాట వలెనే ఆవేగమున నానోట వచ్చినది. మన్నింపవలయును. దేవా. [అని కాల వ్రాలును.

బాణు.—వానిమాటగానే చెప్పు.

కో.పు.—దేవరయాజ్ఞ. "చెఱ నుంచినాఁడట బాణుఁడు, వారిని తెచ్చి యాక్షణమె మాకడ నిడుటయో, మాతో పోరి యమసదనంబునం బడుటయో, రెంట నొక్కటి ఏకక్షణమె నిశ్చయించుకొమ్మను బాణుని." అని పలికినాఁడు.

బాణు.—ఏమీ ! ఈయాదవపశువునకింతహంకారము ! [తలయూఁచి] వీనిమనుమఁడా వాఁడు ! ఇదె యుత్తరము ;—

క. చండికి వానిని బలి యిడ
నుండితి ; నిన్నతనిదుఁగతిఁ బొందక యుండన్
ఖండించి నీశిరము మును
ఖండేందువతంసుసతికిఁ గానిక యిడెదన్. ౯౭

ఇట్లని మామాటగాఁ జెప్పుము.

కో.పు.—దేవరయాజ్ఞ. [అని నిష్క్రమించును.

బాణు.—కయ్యమునకు వీనికి స్త్రీ యేల ? ఆఁడుదానిపాటి వీఁడు పోరలేఁడా ?

---

ఆవేగమునన్ = తొట్రుపాటుచేత. సదనంబు = ఇల్లు.

౯౭ ప.—ఖండేందువతంసుసతికిన్ = చంద్రరేఖను శిరమునఁ దాల్చువాఁడగు శివునిభార్యకు చండికి.

అహ్లా.—తమబాహుకండూతి యుడంప నాతండును, మనుమరాలిని గృహప్రవేశార్థము కొనిపోవ నామెయుం, వచ్చినారు నాయనా. నేఁ డసుర కులమునకు వారివలన కరణమంగళమో మరణమంగళమో రెంట నొకటి తప్పదు.

బాణు.—పందా, కరణమంగళ మేమిరా! ఇదె నీతో చండికి మూఁడు బలులు.

[అని కత్తి యెత్తును. అది క్రిందఁ బడును. అహ్లాదనుఁడు దాని నెత్తి తండ్రిచేత నిడును. బాణుఁడు దానిం గైకొని కోపజడుఁడై యుఱుముచు డోఁదుచు ఉండును.

కుంభా.—[ప్రవేశించి] దేవా, సన్నాహ మైనది. ఆయుధాగారము గుండ తరల వచ్చును. [అందఱు తరలుదురు.

[నేపథ్యమున. ఉత్పాతపఙ్గ్నన. అందఱు ఆశ్చర్యమున వినుదురు.

రాజధాని నాలుగు బ్రద్దలుగా చీలినది! రక్తము వర్షించుచున్నది! కొండలు నిలువుగా పగులుచున్నవి. గండశిలలు కుదియుచున్నవి? వింతమెఱుపులు చదలంట పొడతెంచి కన్నులం బగుల్చుచున్నవి! తుపానులోని యోడ వలె భూమి యిటు నటు నొఱగి అల్లల్లాడుచున్నది! కన్నులలో కత్తులు జ్వలించుచున్నవి! ఎటు చూచినను మొండెము లగపడుచున్నవి! హా! ఇట్టి యుత్పాతములు ఎన్నఁడును వినము కనము! నేఁడు అసురకుల క్షయము!

బాణు.—ఆ నిర్భాగ్యుఁడు గంభీరవేది యిందులకా బ్రతికి యున్నాఁడు! మంచిది! గుండెగలవారెల్ల నాతోఁ రావచ్చును, ప్రాణము తీపైనవారు పోవచ్చును! [అని 'ధూళీపాళీకరింతుక్' ఇత్యాది పఠించి, వామబాహుస్పందనము సూచించి, ఆత్మగతము,] ఏమి యీబాహువులును ఆహా పాత్మని గంభీరవేదికే అనువదించుచున్నవి! ఏమేని గానిమ్ము.

---

వామబాహుస్పందనము=ఎడమభుజములు అదరుట-అపజయ సూచకము.

(వనమయూరము)

ఇల్లిదిగొ గొల్లవటు నిప్పుడె వధింతున్.
మల్లునికి నాకుఁ బ్రతిమల్లుఁ డిసి నీఁడా ?
భిల్లుఁ డహా ! ధూర్తుఁ డయి వేడబము సేయన్
గల్లవరముం బుడికెఁ గానలయు నాకున్. ౯౨

ఇదేమి ! నేలకు మింటికి నొక్కఁడే పురుషుఁడు నాలుగు బాహువులు దక్క కడమ లెక్కలేని బాహువులు ఖండితములై స్కంధపరంపరనుండి నెత్తుర ధారలు దుముక నగపడుచున్నాఁడు ! [విమర్శించి] ఏకేని యగుఁగాక. ఈ వటువు నుంపను.

['ఇల్లిదిగొ' ఇత్యాది పఠించుచు వీరావేశంబున నిష్క్రమించును. ఇతరులు మొగమొగంబులు చూచుకొని సాటోపంబుగ నిష్క్రమింతురు.]

షష్ఠాంకము ముగిసినది.

---

౯౨ ప.—వటున్ = బాలుని. మల్లునికిన్ = జెట్టికి. ఇసి = ఛీ. భిల్లుఁడు = కిరాతుఁడు. (కిరాతరూపముం జెందినశివుఁడు.) ధూర్తుఁడు = వంచకుఁడు. వేడబము = మాయ. పుడికెన్ = ఇచ్చెను.—కల్లవర మొసఁగె నన్నుఁగాఁ బాణునినీఁ దికి వీరుని పంపక గొల్లనిఁ బంపుటచేత.

# శుద్ధ విష్కంభము.

స్థలకము:—శోణపురి, ఆకాశము.

చిత్రరేఖ ప్రవేశించును.

చిత్ర.—ఉష నాథుని బాణమాధవసమరసంరంభంబు విని 'పతిపక్షము గెలిచిన తండ్రి కీడగు, తండ్రిపక్షము గెలిచిన పతి కీడగు' అని కలగుండు పడిన విధమునకు ఇప్పటికిని నాగుండియ జల్లుమనుచున్నది! సమరపర్యవసాన మెఱుంగుటకై దానిచిత్తము తామరాకుమీఁదినీటిబొట్టువలె తత్తరిల్లుచున్నది. [నిర్వర్ణించి] హా! యుద్ధమన నిట్టిదా! బాపురే! బాణమహారాజుతో ద్వంద్వయుద్ధక్రీడ సల్పుచునే ఈద్వారావతీపల్లవుఁడు ఎంతలో సప్తసాగరములకుం బయిగా అష్టమము నీరుధిరసాగరమును సృజించినాఁడు! ఇఁక నీ ద్వంద్వసమరము నిష్ప్రత్యూహతరంబుగ వర్ధిల్లం గావలయును. అహాహా! ఏమి యిది! బాణమహారాజు ఉద్వృత్తగ కత్తిసాముచే మెఱుపులమేరు వైనాఁడు! హా! ఇంక నేమి గనవలయుం! నల్లగల్వతూండ్లకట్టనుండోలె నీలక్ష్మీకళత్రుఁడు నందకంబున మహారాజబాహుదండభారంబు నొత్తివైచినాఁడు! హా! మహారాజు నెత్తుటిగొట్టములకేళాకూళియై ధరణి కొఱఁగినాఁడు! అయ్యో! ఈ వృత్తాంతమును ఉష కెట్లు చెల్పుదును? పోయి కోమలహృదయకు ప్రాణసందేహంబు గాకుండం జెప్పెద. [అని నిష్క్రమించును.

శుద్ధవిష్కంభము ముగిసినది.

---

సమర=యుద్ధ. ఇడుమ=కీడు. రుధిర=నెత్తుటి. నందకంబు = శ్రీకృష్ణుల వారి కత్తిపేరు. కేళాకూళి=జలయంత్రము (బొంట్ఖానా.)

# సప్తమాంకము.

---

స్థలము:—శోణపురి. బాణసభామంటపము.

రుక్మిణీకృష్ణులు బాణాహ్లాదన కుంభాండ
గంభీరవేదులును, రాణియు,
యథావిధముగ పరివారంబును, ప్రవేశింతురు.

బాణు.—[శ్రీకృష్ణు నుద్దేశించి] పరమపురుషా, వేయిబాహువులకును నాలుగు శేషించినవి. ఒడలెల్ల దుస్సహ వేదనలు పొందుచున్నవి. కావు కావు మార్తశరణ్యా. [అని ముంగిళ్ల ప్రాలును.

రాణి.—పతిభిక్షము పతిభిక్షము పతిభిక్ష మిడుము త్రిలోకజననీ.

[అని యొడలి యొగ్గి రుక్మిణిపాదములకడం బ్రళ్లును.

అహ్లా.—ప్రహ్లాదరక్షకా, మానాయనం గావుము.

[అని శ్రీకృష్ణునిపాదములకడం బ్రళ్లును.

రుక్మిణి.—శరణార్థుల ననుకంపనీయులం గావ వేమి యార్యపుత్త్రా?

శ్రీకృష్ణుండు.—లే లెమ్ము, వీరావతంసా, బాణదానవా.

[బాణుండు నిద్రోత్థితుండువోలె లేచి చేమోడ్చి శ్రీకృష్ణుని జాయను రాణియు అహ్లాదనుండును లేచి చేమోడ్చి నిలుతురు.

శ్రీకృష్ణు.—[బాణుని మెయిం బుడవుచు] ఓయి వీరప్రకాండ,

(వనమయూరము.)

అచ్చితిని నీతనయు కర్థితము లెల్లన్,
మెచ్చితిని వీరమున మేటి వని నిన్నున్,
ఇచ్చితిని వజ్రతను వింపుమెయి నీకున్,
గ్రుచ్చితిని కౌఁగిటను గూర్మిమెయి నిన్నున్. FF

---

అనుకంపనీయులన్ = కనికరింపఁ దగినవారిని.

బాణా, మహావీర, నీవును మావలె చతుర్భుజుండ వైతివి. నీవు సత్త్వోత్కర్ష మొసంగితివి. దివ్యజ్ఞానము పిదప నిచ్చెద.

బాణు.—బహుజన్మముల గొప్పతప మొనర్చితిని. [ఉన్నట్లుండి, ఆశ్చర్యముతో]

శా. దేవా, దేవగురూ, భవత్కరుణచే దివ్యేక్షణంబబ్బె నా;
కీవిశ్వంబఖిలంబు నీక్షణములో నీవే యటంచుం బ్రబో
ధావిర్భావము గల్గె; నాది రహితం బైనట్టి యాత్మత్వమా,
ప్రోవ న్వచ్చితివయ్య నన్నడు; నహో పుణ్యం! బహో శ్రీహరీ!

[అని రుక్మిణీకృష్ణుల పాదములం ద్రెళ్లును.

రుక్మి.—ఓయి బాణా, లేలెమ్ము. ఆర్యపుత్త్రమిత్త్రునికి నీ కింకేమి కొఱంత! మాశిశువులం జూడ మా చిత్తము త్తలపడుచున్నది, ఏరీ వారిరువురు?

బాణు.—[లేచి] జగజ్జననీ,

క. నా దుండగమున నయయో!
గాదిలి శిశు లున్నవారు కడలిపరికిణీ
పైదలి కీవల నావలఁ
బ్రాదోషిక కోకమిథున పరుషవ్రతు లై. ౧౦౧

[రుక్మిణి శ్రీకృష్ణుం జూచును. ఇతరులు సంభ్రాంతులై ద్వారములఁ జూతురు. శివజ్వర విష్ణుజ్వరములు ఎదురెదురుద్వారముల ప్రవేశించి ఒండొరులను జుట్టు పట్టుకొందురు. అందఱు సంభ్రాంతులై కందురు.

---

౧౦౧ ప.—అయ్యయ్యో నాదుర్మార్గముచేత ప్రియశిశువులు (ఉషానిరుద్ధులు సముద్రమే పావడగాఁగలదైన భూదేవికి రెండువైపులను (ఒకరికొకరు అత్యంతదూరమున) చక్రవాకదంపతులు రాత్రియం దాదరించు కఠినవ్రతమును కలవారై ఉన్నారు. [చక్రవాకములకు రాత్రి ఎడఁబాటు]

శ్రీకృష్ణ.—[చేయెత్తి] ఎవరురా మీరు?

శివ.—దేవా, నేను శివభక్తుండను శివజ్వరమును.

విష్ణు.—దేవా, నేను భగవద్భక్తుండను విష్ణుజ్వరమను.

శివ.—బాణపక్షమున నేనును,

విష్ణు.—దేవరపక్షమున నేనును,

ఇరువురు.—పోరాడి ఒకరినొకరము ముగించుకొనుచున్నారము.

శ్రీకృష్ణ.—మేలు మేలు! మీ మీ సఖుల ప్రేమగ పిష్టుట మానై మీ కయ్యము లేలరా?

శివ.—[విష్ణుజ్వరమును చూపుచు] వీనికి బుద్ధి లేక.

విష్ణు.—[శివజ్వరమును చూపుచు] వీనికి బుద్ధి లేక.

శ్రీకృష్ణ.—మంచిది. ఈపని చేయుటకు బుద్ధి వచ్చును. ఓరీ శివజ్వరమా, నీవు సౌమ్యరూపంబున చండికాద్వీపమునుండి అనిరుద్ధుని క్షణములో తెమ్ము, ప్రత్యయార్థము ఆహ్లాదనుని గొనిపొమ్ము.

శివ.—దేవరయాజ్ఞ.

ఆహ్లా.—మహాప్రసాదము. [నిష్క్రమింతురు.

శ్రీకృష్ణ.—ఓరీ విష్ణుజ్వరమా, నీవు దివ్యస్త్రీరూపమున, భ్రాంతిద్వీపమునుండి క్షణములో ఉషను పరివారంబుతోడ్కొని రమ్ము. ప్రత్యయార్థము మహారాజ్ఞిని తోడ్కొని పొమ్ము.

విష్ణు.—దేవరయాజ్ఞ.

రాణి.—ఆహా! లోకగురునికరుణ! [ఇరువురు నిష్క్రమింతురు.

బాణు.—[జనాంతికము] కుంభాండా, ఇంద్రాదులను రంభాదులను విడుదలచేసి రమ్ము.

కుంభా.—[జనాంతికము] చిత్తము. [అని పోయి మరలి వచ్చి] అట్లే చేసితిని. వచ్చుచున్నారు.

### ఇంద్రాదులు ప్రవేశింతురు.

ఇంద్రుఁడు.—[దేవతలతో జనాంతికము] నాఁడు నారదముని నాటిం చిననీతిబీజము నేఁటికి ఫలించినది.

దేవతలు.—శేఖర్వధ, సర్వము కాలపక్వము గావలయుంగదా!

ఇంద్రాదులు.—జయము జయము ఆపదుద్ధారకునకు. అమరులము ప్రణమిల్లుచున్నారము. [అని నమస్కరించి]

నీటను డాఁగి కొండఁదాల్చి నెక్కొని నేలను బొత్తె వెట్టి పె
న్గోటను జక్కఁజేసి యడుగుల్ సగమేదియు దవ్వు దాఁటి రా
మాటొనరించి కట్టకలు ముచ్చయి దొంగిలి లేవటంచుఁ డా
టోటుగఁ గత్తిఁ దూఁయు టకటాంకరికిన్ సిరికిన్ జొహారువుల్.

క. దేవా; మా పగతురపై
మావై చెడి యంతిమాస్త్రమంత్రము నీవే;
నీవే మా శాంతికముం;
నీవే మా పౌష్టికంబు, నిగమగ, కృష్ణా. ౧౦౩

శ్రీకృష్ణ.—స్వస్తి. ఇంద్రాదులారా, వీఁడు మదీయభక్తాగ్రేసరుఁడు, మా ప్రాణసఖుఁడు.

బాణు.—
ఇంద్రా.— } మహానుగ్రహము, మహానుగ్రహము.

---

౧౦౨ ప.—దీనియర్థమును ప్రకాశరుద్రీయ నాందిలో చూడ వచ్చును.

౧౦౩ ప.—శాంతికము=కీడుందొలఁగించుకర్మ. పౌష్టికము=శ్రేయము గలిగించు కర్మ. నిగమగ = వేదగోచరుఁడా.

రంభాదులు ప్రవేశింతురు.

రంభా.—జయము జయము త్రిలోకజననీజనకులకు, దేవబందీవిమోచయితలకు. అచ్చరలము మ్రొక్కుచున్నాము. [అని మ్రొక్కి]

(గేయము.)

హారికి మంగళము మా యాపద తీర్చు సిరికి మంగళ మిదే.
తాతకు జోహారు మా యమ్మను గన్న తాతకు జోహారిదే.
బావకు సలాము మా యింద్రునితోడి మఱందికి భద్ర మిదే.
హారికి మంగళము మా యాపద తీర్చు సిరికి మంగళ మిదే ౧౦౮

శ్రీకృష్ణ.—కల్యాణము కల్యాణము.

బాణు.—శిరీషకుసుమంబుల కొందలో పయిచినందులకు లజ్జించెద.

రంభా.—బాణమహారాజా, నీవలన జగజ్జననీజనకుల కృపకుం బాత్రమైతిమి.

ఆ. జాతిరత్న మొందు సానం దీర్పటం జేసి
రాజమకుట మెక్కరమ్యగతిని,
క్లేశకారి యైనం గేళాదిసంస్క్రియ
వలపువానిమూర్తి నలరం జేయు ౧౦౯

బాణచక్రవర్తీ, నీవు మాకు గురువవు గాని పరిపంథివి గావు.

అనిరుద్ధుండును ఆష్టాదసుండును ప్రవేశింతురు.

అని.—తాతకు అవ్వకును అనిరుద్ధుండను మ్రొక్కుచున్నాను.
[అని ప్రణమిల్లును.

రుక్మిణీకృష్ణ.—రా నాయనా రా.
[అని చేరందివిచి ఒడిం గూర్చుండంబెట్టుకొని లాలింతురు.

---

౧౦౮ ప.—అమ్మను గన్నట్టి గంగను కన్నట్టి.

[నేపథ్యములో దుందుభిధ్వానము పుష్పవృష్టియు.]

రుక్మి.—[అనిరుద్ధుని కపోలమున చేయియుంచి అతని మొగముతట్టు తన పైకు త్రిప్పుకొనుచు] కష్టములు పడితివా నాయనా?

అని.—మిముఁ బాసినకష్టమే గాని యిందు కష్టము లేదు.

అహ్లా.—అహో! ఎట్టిమహాసత్త్వుఁడు!

శ్రీకృష్ణ.—ఒరులకు పట్టువడితివేమి బాలకా?

అహ్లా.—జగద్గురూ, మాచెల్లెలియపరాధ మది. ఆసమయమున ఉష 'ఆర్యపుత్త్రా, మా నాయనను గావుము' అని వేఁడినది. ఆమాటకు ఈమహాసత్త్వుఁడు కట్టువడియెనే గాని మానాయనగారి నాగపాశమునకుం గట్టువడలేదు.

శ్రీకృష్ణ.—[నవ్వుచు] సరి, సరి.

బాణు.—[అనిరుద్ధునికి మోఁకరించి] పుత్త్రభాండ, అసునవృత్తిపై గుణము గ్రహింపనొల్లనినా నేరమిని మన్నింపుము. [అని గడ్డము పట్టుకొనును.

అని.—ఎవర వోయి నీవు?

బాణు.—నీమామను బాణాసురుఁడను.

అని.—[ఆశ్చర్యపడుచు] నీ వెక్కడిబాణాసురుఁడవు? బాహుసహస్రమేది?

బాణు.—వాని నడఁగుము. [అని శ్రీకృష్ణుని చూపును.

అని.—[లేచి, బాణునిచేయి పట్టుకొని] నాయాలంబున మామకుం గలిగిన ప్రమాదము మామయే నన్ను మన్నింపవలయును.

[అని చేబోక యాసనమునం గూర్చుండును.

బాణు.—నీయాలంబునంగదా నాకు సకలాభ్యుదయములుం గలిగినవి!

అహ్లా.—[నిర్వర్ణించి] నాయనా, అదె ఉష వచ్చుచున్నది.

ఉషం దోడ్కొని రాణియు, చిత్రరేఖయు,

శిశువుం గొని కరేణుకయు,

ప్రవేశింతురు.

ఉష.—[చిత్రరేఖతోడ జనాంతికము] చిత్రరేఖా, సఖి, అహో ఆర్యపుత్త్రుఁడు మరల శుభదర్శనుఁడు ఈకన్నులకే అగపడుచున్నాఁడు! ఈ

ఉమ.—[ఆత్మగతము] అహో! నాయన దైన్యమును నే నెట్లు గందును!

[అని కన్నీళ్లు నించును.

రాణి.—[సబాష్పము] నీదౌహృదమేని యభినందింప నోఁచనైతినిగదా!

ఉ. లోకములోనఁ దల్లు లతిలోలలు వేవిళులైనకూఁతు న
స్తోక ముదంబుతో నరిది సూడిదలన్ విభవోత్తరోత్సవా
నీకములన్ విభూషలను నిత్యము నోముదు; రట్టి తల్లినై
యీగతి నాత్మ నీ కడినయోఁదర లింపులు నార్తులే గదా. ౧౦౬

ఉమ.—[సబాష్పము] నాయనకుం గ్లేశ మిడిన నేను గదా యపరాధను, నాకష్టాలు నాయన మన్నింపవలయును. [అని బాణునిపాదముల వ్రాలును.

బాణు.—లే అమ్మ లే. [అని లేపి] నీకు సర్వశ్రేయములును త్రైలోక్యమాతాపితలు వా రొసంగుదురు. నాపెట్టిన క్లేశములు మఱతువా అమ్మా?

[అని బాష్పములు విడుచును.

ఉమ.—[స్వగతము] ఈతని గురువుల ప్రేమల నాయనకు ఏమి బదులు పలుకఁగలము! [ప్రకాశము] నాయనా, ఎఱుఁగనిదాని నెట్లు మఱతును!

బాణు.—పట్టీ, నీక్షమచే లజ్జితుఁడను. [అని బాష్పములఁ దగును.

శ్రీకృష్ణు.—రావోయి బాణా, రా; నీదౌహిత్రుని గనుము.

[అని శిశువును ఇచ్చును.

బాణు.—[గాని కని] అహో!

తే. అమృతమున నూరినట్టి కల్పకపుఫలము!
వెలఁది చక్కెరవెన్నెల వింతబొమ్మ!
ఈబుడుతగాని నింక నే నీయఁజాల!
చినిగొలన వ్విదెంత నిర్వృతికరంబు! ౧౦౭

---

౧౦౬ ప.—అతిలోలలు = అత్యంతప్రేమ కలవారు.

౧౦౭ ప.—కల్పకపుఫలము = కల్పవృక్షముయొక్క పండు. వెలఁది = ధావళ్యముగల. ఎలనవ్వు=లేఁతనవ్వు. నిర్వృతి=ఆనంద.

[అని ముద్దిడి] ఏమి మొగము చిట్లించెదవు! మీసలు గ్రుచ్చినవా? లేక నీవును ఆలోచన వాఁడవా?

రాణి.—అమ్మలక్క ముద్దా, నిన్ను, మందభాగ్యురాలను లాలింప నోఁచనైతిని. [అని చెక్కిళ్లు పుణికి తనకపోలమున మెటికలు విఱుచును.

బాణు.—[శిశువును ఉషచేతి కిచ్చి, ఉషను చేలఁ గొని] అనిరుద్ధ మహారాజా, నాదుండగమునకు దండువుగా ఇదె నీకు ఉష నిచ్చుచున్నాను.

(మత్తకోకిల)

దళితశత్రుఁడ, నీకునై యుష కాఁ సహించిన బన్నముల్
కులగిరుల్ గలయంతకాలము ఘనాఘనుల్ ధరణీస్థలిన్ ;
గలఁగకో యదువీర, నాకయిఁ ; గన్నె నర్మిలి నేలుమా!
తలఁపకయ్యె యుషన్ స్వయంవృతదత్త నొప్పరికింపఁగాన్. ౧౦౦

అని.—పెద్దల చిత్తమును తప్పు చేసికొనను.

శ్రీకృష్ణ.—అశితుచ, కొసరటోయి బాణా? సాలంకారకన్యాదాన మెఱుంగుదుముగాని సపుత్త్రకన్యాదానము చేసినవారిని కొన్నవారిని ఎఱుంగము.

[ఉషా చిత్రలు సాహూతముగా నొండొరులఁ గందురు.
ఉష సలజ్జముగా నధోముఖిగా నుండును.

రుక్మి.—ఉషా, శిశువును నీయార్యపుత్త్రునిచేతి కిమ్ము.

[ఉష ఇచ్చును, అనిరుద్ధుఁడు గ్రహించును. నేపథ్యమున దుందుభిధ్వానము పుష్పవృష్టియు. ఉష చిత్రలేఖను సాహూతముగాఁ గాంచును. చిత్రలేఖ సాహూతముగా మందహాస మొనర్చును. అనిరుద్ధుఁడు శిశువును నిర్వర్ణించి రుక్మిణిచేత నిచ్చును.

---

౧౦౦ ప.—బన్నముల్ = పాట్లు. కలఁగకు = కోపము చేయకుము. అర్మిలిన్ = ప్రేమతో. స్వయంవృతదత్తన్ = స్వయముగా నీ చేవరింపఁబడి తానుగా తన్ను నీకిచ్చుకొన్న దానిని.

రుక్మి.—[ఉషం జేరc బిలిచి] మహాసాధ్వీ, ఉషా, నీకు తఱుగని సౌభాగ్య మిఁద యొసంగితిని.

ఉష —[కేల్మోడ్చి] మహాప్రసాదము. [స్వగతము] నాచెలి వలవం తయుఁ దీఱినంగదా నేను ధన్యురాలను.

రుక్మి.—[ఆత్మగతము] ఆహా! దీనిహృదయ మెంత మైత్రీకోమలము! [ప్రకాశము] ఆర్యపుత్రా, వీని కిరువురకు కామ సహాయ, ఉషకు అస్మ దుపాస నోపదేశ గురువు, నారదశిష్య మహాయోగిని, గుణఖని ఈ చిత్రరేఖ. దీని యాప్సితమును ఈ యుషాభ్యుదయముతోc గూర్పుఁడు.

రాణి, బాణు.—ఆహా! ఈపుణ్యాత్మురాలా, ఉషకును మాకును ఇంత యభ్యుదయము కావించినది. [రాణి చిత్రం దఱియc దివిచి బుజ్జవించును.

శ్రీకృష్ణు.—ఇయ్యవోయి కుంభాండా, నీతనయను అస్మత్పౌత్త్రుc డ దేళ్యునికి అహ్లాదనునికి.

ఉష.—[స్వగతము] ఆహా! ఏమి నా పుణ్యము! మాయన్నకే చిత్ర యాభరణ మైనది!

కుంభా.—మహాప్రసాదము. [అని చిత్రరేఖ నొడి నిడుకొని]

ఉ. నాదగుకోర్కె చే భువననాథునియానతిచేత నిత్తు నా
గాదిలియాత్మజన్ గగనగామిని యోగినిc జిత్రరేఖ నీ;
కోదనుజేంద్రనందన, దయోచితవైఖరి నేలు కూర్మిలోc
జేదవు గాకుమన్న; నినుc బెన్నిధిc గోరిన దన్న భర్తగాన్.

[అని యాహ్లాదనుని కిచ్చును.

అహ్లా —పెన్నిధి ప్రథమముగదా. మహాప్రసాదము.

---

౧౦౯ ప.—భువననాథుని = జగన్నాథుఁడయిన శ్రీకృష్ణునియొక్క. దనుజేంద్రనందన = అసురరాజకుమారుఁడా. పెన్నిధిన్ = పెద్దనిధానమును.

పెన్నిధి ప్రథమముగదా—పెన్నిధి ప్రథమావిభక్తియయిన 'నాకు పెద్ద నిధానమయిన చిత్రరేఖయే నన్ను కోరినది' అని భావ మగును.

బాణు.—ఓహో శ్రోత్రవ్యాకరణాధ్యయనము! [అందఱు నవ్వుదురు.

అని.—పెద్దలయాజ్ఞ చేతను స్వేచ్ఛ చేతను గ్రహించుచున్నాను.

[నేపథ్యమున దుందుభిధ్వనాదికము.

రుక్మి.—చిత్రరేఖా, నీవు తలఁగని సౌభాగ్య మొసంగితివి.

చిత్ర.—[కేల్మోడ్చి] మహాప్రసాదము.

రాణి.—[చిత్రరేఖం జేరంగొని] గూర్చిన మాభాగ్యము రాసుల్క రారమ్ము యువరాజపట్టమహిషీ.

[కరేణుకా గంభీరవేదు లొండొరులం గని గుటకలు మ్రింగుచుందురు.

శ్రీకృష్ణ.—వీ రెవరు? వీరికిని అన్యోన్యదాంపత్యాభిలాష పొడమియున్నది.

బాణు.—మహానుభావా, వీఁడు నా బంధువు, ఓస్త్రీ శిశువుల యిడుమలు. ఇది యుపాధ్యాయి. ఇది వీనికి తగినదాంపత్యము.

రంభ.—[ఊర్వశితో జనాంతికము] అది నీకంటికి వెన్నెలబోనము.

శ్రీకృష్ణ.—వీరికిని దాంపత్య మగునుగాక. మాలలు మార్చుకొండి.

[కరేణుకా గంభీరులు సంతుష్టితో అగ్న్యాదుల సాహాయ్యంబున మాలలు మార్చుకొందురు. నేపథ్యమున దుందుభిధ్వనాదికము.

ఊర్వ.—[రంభతో జనాంతికము] సఖీ, రంభా, ఆగంటికిని ఇది దృష్టిపరిహారమునకు.

శ్రీకృష్ణ.—మీకు నమస్కృతికి సెలవు. కాని మీరు దండెములు తీయలేరు. అందఱకును ఒక్కమాటే దొరలదు.

[అందఱు నవ్వుదురు. ఆయిరువురు నక్లే దొరలుదురు.
గంభీరవేదియుఁ గరేణుకయుం యత్నించియును లేవలేరు.

రంభ.—[జనాంతికము] ఊర్వశీ, ఈనాట్యము ను నీ వెక్కడనేని నేర్చితివా?

ఊర్వ.—ఇప్పుడు నేర్చుకొందము.

శ్రీకృష్ణ.—వీరిదాంపత్యము మిగుల శోభిల్లుచున్నది.

వేదము వేంకటరాయశాస్త్రిగారి

# సులభవచనగ్రంథములు.

---

| | | |
|---|---|---|
| భోజరాజుని యద్భుతకథలు, ప్రజ్ఞ కలిగించునవి. | 0 | 12 |
| విక్రమార్కుని యద్భుతకథలు, గుణము కలిగించునవి | 0 | 12 |
| కథాసరిత్సాగరము, సోమదేవభట్ట విరచితమైన సంస్కృతకథకు సరియైన తెలుఁగు. అద్భుతనీతి వ్యవహారకథలు. నాలుగుభాగములు. కొన్నిభాగములు పునర్ముద్రితములు. | 9 | 0 |
| దశకుమారచరిత్రము, అత్యద్భుతప్రజ్ఞాప్రయోగములకథలు | 1 | 0 |
| ఛందస్సు. ఈశాస్త్రమునంతయును శాస్త్రులవారు రెండుమాటలలో చెప్పినారు. విద్యార్థులకుపయోగము. సులువుగాను సంగ్రహముగాను విరచితము. | 0 | 3 |

## విమర్శలు — ఉపన్యాసములు.

| | | |
|---|---|---|
| గ్రామ్యభాషాప్రయోగనిబంధనము. (నాటకగ్రామ్యము) | 0 | 12 |
| విమర్శవినోదము. కతిపయ సంస్కృతాంధ్రకావ్య నాటకాది శోధకము. | 0 | 12 |
| విసంధివివేకము. | 0 | 2 |
| భారతాభారతరూపకమర్యాదలు. (భరత + షేక్స్పియరు. నాట్యకళాచరిత్రము) | 0 | 4 |
| ఆంధ్రగ్రంథవిమర్శనప్రకారలేశము. తెనుఁగుపుస్తకముల నెట్లు విమర్శింపవలయుననుమాటనుగూర్చినది. | 0 | 4 |
| గ్రామ్యాదేశనిరసనము. శాస్త్రులవారు అన్నిజిల్లాల గ్రామ్యములను వర్ణించియున్నారు. కడుపుబ్బనవ్వించు విమర్శ. | 0 | 4 |
| ఆంధ్రహితోపదేశచంపువు. | 1 | 4 |